Recd 18/2/59.

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

**శివలెంక శంభుప్రసాద్**



**ఫిబ్రవరి 1959**


సంపుటము 36 : : సంచిక 2


విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1959



## మార్చి సంచికలో

# ప్రభాత వృత్తము

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

వెలుగుల మేలుగు వెల్లు వచ్చె; ఈ భూ
వలయమునన్ బహువర్ణ కాంతి విచ్చెన్
అల నిశ భానునియందు పుట్టె; అట్లె
వెలసిన దా నిశ బిడ్డయై ఉషశ్రీ!

వెలుగు సుతున్ గను వెల్లుమూర్తి రాగా
తొలగె నిశీథిని త్రోవచేసి ఈ ఉ
జ్జ్వల పతికై; చను సంతతి మ్ముషా రా
త్రు లిటులె ఒండొరు త్రొక్కి వెంట వెంటన్.

దివి ప్రసవించిన దివ్యమూర్తు లోహో!
ఇవి దివి కిచ్చు ననేక వర్ణశోభల్
అవు నొక త్రోవని ఆ సహోదరీ యా
త్రి; విసిగి నిల్వవు - రాదు ఘర్షణేన్.

తనువులు రెండుగ తాము తోచు గానీ
అనుజుల కిర్వుర కాత్మ ఒక్కరూపే!
అనయము ఈద్వయ మభ్రవీథి పర్యా
య నియతి దేవ నియంత్రణన్ చరించున్.

సురలకు చేర్పగ సూక్త మంత్ర కోటిన్
తెరచి కవాటము దీప్త వర్ణ వచ్చెన్!
ధరణి ప్రవృత్తికి దారిజూపి, శ్రీలన్
విరిసి ఉషస్సు ప్రవించె సర్వ వృత్త్యన్!

ముడుచుక పండిన భూమి మేలుకొల్పెన్
నడపె జనాళి ధనమ్ము విల్పు బాటన్
కడచని లోకపు కంట ప్రసన్నదృష్టుల్
విడిపడె లోచనవీథి దూర సీమల్.

ఒకని జయార్థ మింకొక్కనిన్ యశోఽర్థ
మ్మొకని యశింప, మరొక్కనిన్ నిజేష్ట
మ్ము కొన - జనుని పలువుం దెఱందు ప్రేరే
చి కను ఉషస్సు గ్రసించె సర్వపృథ్విన్ !

అదె గగనాత్మజయా ఉషస్సు ధాత్రిన్
గదిసెను జవ్వని కట్టి వెల్లకోకన్
సదయత విశ్వము సర్వమేలు రాణి!
పృథివి నమో! జననీ! సుమింపు మింకున్.

అనుదిన కోటి ఉషాళి కాదియామున్
చను మును చన్న ఉషాళి త్రోవనే ! ఉ
ర్వని మృతజీవుల విడి సర్వ జీవ
జ్జనుని ప్రబోధితు సల్పు నీ ఉషశ్రీ!

అనిలుని ప్రోజ్జ్వలితాత్మ జేసి, నేలా
ఇనుని వెలుంగు మహిన్ వెలార్చి, కూర్మిన్
మనుజుల జన్మ మమర్చె దేవతాళిన్
తనిపెద వో ఉష! తత్ప్రియమ్ము సేతన్.

ఓయయు ఉషస్సిది ఒక్కనెంత కాల
మ్మో ? చని తొల్లి అనేకముల్ విభాత
మ్ములు ; మరి భావిని వచ్చు నెన్నొ ఇట్లే
తెలసిన ఈ ఉష వేగు నింతలోనే!

# ప్రభాతవృత్తము

చనిన ఉషస్సులు సాక్షులైన వారల్
చనె; రిపు డీ ఉష సాక్షి లేము; ముమ్ముం
దొనరు ఉషస్సుల ఒప్పగాంచు వారల్
జననము గాంతు రిలాతలాన భావిన్.

అరుల నడంచి, ఋతావనమ్మొనర్చన్
నర సుఖదాత్రి! జనాళి మంగళశ్రీ!
సుర శుభకారిణి! స్తోత్ర పాళి ప్రీరే
చిరహా నుషా! వికసింపు ముర్వి పైనన్.

వెనుక ఉషస్సృతి వెల్గె శశ్వదాభన్
కన నిపుడున్ మరి కాంతిమూర్తి యే! ఈ
ధనపతి సాగు ఇదం విధాన ముమ్ముం
దును జరయున్ మృతి దూరమై యథేచ్ఛన్!

దిశలు, దినమ్మును తేజరిల్లగా ఈ
ఉష అసితాకృతి నుజ్జగించి వచ్చెన్
లన దరుణాశ్వ విలాసియౌ రథానన్
వసుధను బోధ విభాసుధన్ వెలార్చెన్!

ఇరులు చనెన్; మన కిల్ల ప్రాణమౌ సుం
దరి ఉష తోచెను దాల - లెమ్ము జీవా!
తరణికినై ఉష దారి చక్క - జేసెన్
నరుని చిరాయు వొనర్చ వెల్గు విచ్చెన్!!

విలన దుషస్సృతి వెంటనంటె సూర్యుం
డిల జవరాలి వరించు కోడెకాడుం
బలె - ఇట మానవపాళి కర్మనల్చన్
కలుగు శుభమ్ము యుగాలు నిల్చిపోవన్.

హయముల, వీరసుతావళిన్, వర్షిగో
చయము నొసంగు ఉషా! తమోనిహంత్రీ!
దయ ప్రభవింపుము - తన్ను మమ్ము స్తోతన్
భయహారణా! స్తుతిపాత మంతి మొందన్.

చదల వెలుంగుము సౌరమాతయే యూ
అదితి ముఖాకృతి! అధ్వర ధ్వజశ్రీ!!
ఉదిత సుమంత్ర శిఖోత్థ సత్ఫలాభన్
పొదలుము - చేర్చు మమున్ ప్రజాళిలోనన్.

చదల వెలుంగు ఉషస్సతిన్ స్తుతించెన్
మధుర మృదూక్తు లమర్చి స్తోత; లక్ష్మీ
ప్రద! ఉష!! ఇంతట రావె - వీనికై అ
భ్యుదితవు కావె! శుభోత్కరమ్ము లీవే!!

[ఋగ్వేదము ప్రథమ మండలములోని 113 వ సూక్తమైన ఉషస్సూక్తమునకు అనువాదము]

వావాడపతి కంధార సింధురాష్ట్రకు
లరిగాపు లెవ్వాని ఖురలితరాని
కాపంచగౌడ ధాత్రీతలం బెవ్వాని
కసినాగాగా కొలువటె బయలు శి

దాదాపు అర్ధశతాబ్దము క్రిందట కీర్తిశేషులయిన శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు మీఁది సీసపాదములలో ప్రస్తావింపబడిన చరిత్రాంశముల నిట్లు వివరించియున్నారు.

3 పై యూఁడు చరణములలోని 'ఉదయాచలేంద్రము', 'వావాడపతి', 'కంధార', 'సింధురాష్ట్రకు' అను పదములచేఁ గవి కొన్ని చరిత్రాంశముల సూచించినాఁడనుటకు సందేహము లేదు. ఉదయాచలేంద్రమనఁగా నెల్లూరిసీమలోని ఉదయాద్రి. కుమారస్వామి క్రొత్త బలమును భేదించి దూరి కొండ బిడీలు కృష్ణదేవరాయలు ఉదయగిరిని భేదించి దూరి పేర్పుఱచుకొని దుర్గమును ప్రవేశించెను. 'సింధురాష్ట్రకు' అనగా గజపతియని చెప్పిన టీకాకారుల యర్థమును మన మంగీకరింపవచ్చును. కాని ఇతర పదములవలన దేశములనుగాని యేరాజునుగాని గ్రహింపవలయునో టీకాకారుల వ్రాతలవలన స్పష్టపడుటలేదు. 'వావాడపతి = వావాడదేశపురాజు; కంధార = కంధారదేశపురాజు; పంచగౌడధాత్రీపదము = [illegible]జీలు మొదలయినవారి ఉత్తరదేశము' అని టీకాకారులు వ్రాసియున్నారు. ఇంతకంటె అధిక స్పష్టతరమైన యర్థమేమైన నిందుండి లాగవచ్చునేమో యాలోచింతము. ఇందలి 'కంధర' శబ్దము 'కంధార్' అను పారశీక శబ్దమునకు సంస్కృతి రూపమని నా భావము. కృష్ణదేవరాయల కాలమున గుజరాతు రాజ్యముపై కంధార్ అను వా డుండెను. ఇతనిచే పేర్కొనఁబడు గౌరవమున్న కంధారుఁ డీతఁడే యని దేవరాయలు గుజరాతుమీఁదికి క్రీ.శ. ౧౫౨౬లో దాడివెడలి చెప్పవలయును. కాని అదేమన ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ యీ మూఁడు నెలలలో నెప్పుడో యొకప్పుడు వెళ్లెనని కూడఁ జెప్పవచ్చును. ఎందుకన నితఁడీ మూఁడు నెలలే రాజ్యము జేసెను. ఈ కాలము మనమూహించిన కాలముతో సరిపోవుట లేదు. ఈ రెండు కాలములలో నేది నిజమో పరిశోధింపవలెను.

4 'అపంచగౌడ ధాత్రీపదము'లోని 'అఙ్' అను దానికి మనము 'మర్యాద' అనియే యర్థము తీసికొనవచ్చును. 'అభివిధి' అని తీసికొనవలక్కరలేదు. ['ఆఙ్ మర్యాదాభివిధ్యోః' అని పాణిని ౨-౧-౧౩] 'అపంచగౌడ' అనఁగా పంచగౌడదేశములవఱకు అని యర్థము. పంచగౌడము లనఁగా సారస్వతులు, కాన్యకుబ్జులు, మైథిలులు, గౌడులు, ఉత్కళులు. గుజరాతీలు పంచద్రావిడులలోనివారే కాని, గౌడులు కారు. కావున అపంచగౌడములనఁగా గుజరాతు దేశమువఱకు అని యర్థము చేయవచ్చును. దానికి గౌడదేశము తగిలి యున్నది కనుక అపంచగౌడపద మిచ్చట మర్యాదాపదము. ఇట్టి పద్యము కృష్ణరాయని యుత్తర (సర్వదకు తిరి) దిగ్విజయ యాత్రను సూచించుచున్నదని యర్థము చేసికొనవచ్చును. అపంచగౌడమనగా నర్మదకు నుత్తరమునకున్న హిందూదేశ మంతయు నర్థము చేయవచ్చును. ఇందునుగూర్చి యింతకంటె నెక్కువ చర్చించుటకు నధికసాధనము లేవియు లేవు."4

దాదాపు అర్ధశతాబ్దమునకు ముందు శ్రీ లక్ష్మణరావుగారు పై నుదాహరింపబడిన సీసపాదములలో నిగూఢమైయుండు చరిత్రాంశములను గుర్తించి వానిని వివరించుట గొప్పవిశేషము. కాని వారు పేర్కొనబడియుండు కంధరుడు క్రీ.శ. ౧౫౨౬ లో మూఁడు మాసముల కాలము గుజరాతు సింహాసనము నధిష్ఠించియుండిన సికందరుని తలంచి తాము చెప్పిన వ్యక్తి నిర్ధారణ కనుకూలముగ నప్పుడు లభించిన సాక్ష్యలేశముం గర్థము నిర్ణయించిరి. మన చరిత్ర క్రీ.శ. ౧౫౨౦ వ సంవత్సరమునకు ముందే విరచింపబడి యుండెనని యందంతరితసాక్ష్యాంశములు సూచించుచున్నవి. అటులైన క్రీ.శ. ౧౫౨౬ సంవత్సరమున గుజరాతు సింహాసనము నధిష్ఠించిన సికందరు నందు పేర్కొనుట యసంభవము. మఱియు కృష్ణదేవరాయల కాలమున రాజ్యముచేసిన సికందరు షాహుఖారి క్రీ.శ. ౧౫౨౬ లో గుజరాతును పాలించిన యీ సికిటిప్రభు వొక్కఁడే కాఁడు. మఱియొకఁడు గాఁడు. ప్రస్తుత వితర్కమునకు సంగతమైన కృష్ణరాయల గయ శిలాశాసనము మార్గాంతరమును సూచించుచున్నది. ఉత్తరహిందూదేశము కృష్ణదేవరాయల

---

3 ఎను 1 : 11.

4. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక – కాళయుక్తి సంవత్సరము, సప్తమ సంపుటము, పుట ౩౧౩ తరువాయి.

కాలమున దురహంకారుడై ఇబ్రాహీం లోడీ యధీనమున నుండెనని శ్రీ శర్మగారు చెప్పియున్నారు కదా. ఈ యిబ్రాహీంలోడీ ఢిల్లీ సింహాసన మధిష్ఠించినది క్రీ. శ. ౧౫౧౭ వ సంవత్సరమునందు. తత్పూర్వ మతనితండ్రి సికందర్ లోడీ రాజ్యాధిపతియై యుండెను. కృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౦౯ మొదలుకొని ౧౫౨౯-30 వరకును రాజ్యము సల్పి యుండుటచేత నతనికి క్రీ. శ. ౧౫౦౯-౧౫౧౭ లలో సికందరులోడియు, ౧౫౧౭-౧౫౨౯ లో ఇబ్రాహీం లోడియు సమకాలికు లగుదురు. కావున కృష్ణరాయల కరిగాపని పెద్దనార్యునిచే పేర్కొనబడిన సికందరుడు సికందర్ లోడీ కావచ్చును. ఇందసంగతి మేమియు లేదు. అపంచగౌడ ధాత్రీపదమునకు శ్రీ లక్ష్మణరావుగారు చెప్పిన యర్థమును గ్రహింపక పరంపరగ వ్యాఖ్యాతలు నిర్వచించుచు వచ్చిరట్లు అందలి అక్ అనుదానికి 'అభిరిధి' పదముగ నర్థముచేసికొనిన సికందరు గౌడధాత్రి నేలుచుండిన ప్రభువులలో నొకడని మన మనుకొనవచ్చును. "అపంచగౌడధాత్రీపదంబు = పంచగౌడదేశములపర్యంతముకల భూభాగము (గౌడులు కాన్యకుబ్జులు, సారస్వతులు, ఉత్కలులు, మైథిలులు అని గౌడు లైదు తెగలవారు). అపివాలుగాన్ = హ్యారీగా పెనుఱట్టి బయలు అనగా గౌడదేశము వఱకును కల దేశమంతయు కృష్ణరాయనికి వాహ్యాళివెడలు దేశముగా నయ్యెననుట' వావిళ్ళ వారి వ్యాఖ్య.5

పెద్దనార్యునకు పేర్కొనిన సికందరుడు ఢిల్లీ ప్రభుడైన సికందరులోడీయే యైన పక్షమున కృష్ణదేవరాయలు ఉత్తర హిందూస్థానముపై క్రీ. శ. ౧౫౧౭ నకు అనగా సికందరులోడీ మరణమునకు ముందొక పర్యాయము దండెత్తి యుండవలయును. పై పీన పాదములలోని 'అపివాలుగా జేయుంటి బయలు' అనువాక్యము కృష్ణదేవరాయలు ఉత్తర హిందూస్థానముపై దండువిడచిన దొక్క పర్యాయముగాను పెక్కుసారులని సూచించుచున్నది. 'అపివాలు' అను పది యొక్క మాటకాదు; మిశ్రపదరూపము; అపి (=ఖడ్గము) + వాలు (=ప్రసరించు, వ్యాపించు) అను పదముల కూడికచే నేర్పడినమాట. ఖడ్గసాధనము చేయుటకై కృష్ణరాయ లనుదినము పోవునట్టి బయలు అని దీని యర్థము. అనగా, కృష్ణదేవరాయ లుత్తర హిందూస్థానముపై బలపూరు సాగించువాడని యర్థము. ఇది కేవల మతిశయోక్తి కాదని ప్రస్తుతాంశమునకు ఆధారభూతమైన రాయల గజశాసనము విశదము చేయుచున్నది. సికిందర్ లోడీ కృష్ణరాయలకు కప్పముగట్టి సొమ్మొసంగి సెవికొనిన యుదంతము ప్రకారము ఆతని కుమారుడు ఇబ్రాహీము ప్రవర్తించకపోవుటవలనో మరియే కారణమువలనో కృష్ణరాయలు క్రీ. శ. ౧౫౨౧ వ సంవత్సరమున మరల ఉత్తరహిందూస్థానముపై దండు వెడలినట్లున్నది. ఇది విజయవంతముగ కొనసాగినదనుటకు ప్రస్తుత గజ శిలాశాసనమే సాక్షి.

ఇంతవఱకు గజశాసనమున పేర్కొనబడిన కృష్ణరాయల విజయయాత్ర విషయమై విచారించితిని. ఈ శాసనమున వచించిన విజయము యుద్ధవిజయమే కాని కేవలగారసువానము యాత్రావిజయ మెంతమాత్రముకాదు. కృష్ణరాయలు ఇమ్మడియాలు ఆదిల్ దళముగ కృష్ణాతటమున పూర్ణాహుతిజేసి రాయచూరు దుర్గమును స్వాధీనపఱచుకొనిన తరువాత కొన్ని నెలలలో ఈ గజ విజయయాత్ర నడచినట్లున్నది. ప్రస్తుతము ఆ దండయాత్రనుగూర్చి ఇంతకుమించి చెప్పదగిన విశేష మెదియును లేదు.

ఇక ముక్కు తిమ్మన్నగారు గజ శిలపాయిలో ఇంచుక విచారింతము. శ్రీ శర్మగారు తిమ్మనగారి పోకకు రెండువిధముల కారణ మూహించినారు. (1) రాయలు తన మాతాపితల సుకృతార్థమై కాశీ ప్రయాగ క్షేత్రములకు దానము గాగ దాన యాత్రా కవిత్వాని తిమ్మన పనిపి యుండవలెను. (2) కాశీని తిమ్మనయే యాత్రార్థి మగిగి యుండవలయును. ఈ రెండు కారణములును సరియైనవి కావు. శాసనము ఈయూహల కాధార మెదియు లేదు. ఆంధ్రభోజుడు కవితాప్రియుడు. అన్ని భాషలకంటె ఆంధ్రభాష మీదనే అతనికి మక్కువ ఎక్కువ. దేశభాషలందు తెలుగు లెస్స యని యతని యభిప్రాయము. తెలుగు కవులనుండియు తన యష్టదిగ్గజముల నేర్పఱచుకొని వారి గోష్ఠియందె నిరంతరము విద్యావినోదముతో ప్రొద్దుపుచ్చెడువాడు. యుద్ధమునకు పోవునప్పుడు గూడ వారు తనవెంట నడువవలసినదే. తన విజయములను వారు చూచి వర్ణింపకున్న నతనికి తృప్తిలేదు. ఈ విషయము రాయవాచకమున ప్రస్తావింపబడి

5. మను (వావిళ్ళప్రతి) పుట. 8.

"గత్యంతరం వారి చిన్నది గజ్జకట్టిందంటే పందెం వేసి నెగ్గే ఆడకూతురు, ఈ గడను కాదు కదా, ఈ సీమలోనూ, ఆఖరుకి ఈ దేశంలోనూ కూడా లేదని చెప్పాలి.

"ఆ చిన్నదాని రూపురేకలు చూసి, చూసు వాగనుకి చొక్కి చిక్కిన మనసు, దక్క బళాయితో లేక చిన్నదాని పొందుతో భువిలో నే దివి జేరవచ్చునని భూపతులవారి బిడ్డను, శ్రీపతులవారి సింగడు రాజా మహ్మసుల్తాన్ దంగతళీను రంగారాయబహద్దరువారు తలపోసేరు, తపించేరు.

"చిన్నదాన్ని తలచి, తలపుతో తలచి, తలపుతో తపించి, తపనతో నిలచి పిలచేరు. అయితే ఊరక నే పిలచారా? కాదు. పిలుపుతో బాటు బండిసారె, బాల దొడుగుమాత్రమే కాకుండా పద్మపట్టు, పాలపట్టు, పొన్నాడిపట్టు, కొర్నాటపట్టు, జిలుగుపట్టు, క్షీరాబ్ధి పట్టు, శ్వేతంపుపట్టు మొదలయిన సమస్తరకాల పట్టు బట్టలతో సర్వవిధాలయిన చీనీ చీనాంబరాలు జత కూర్చి—వాటికిటు వరిత లందరికి పాడిపసువులతో కూడా వాసిగా కొన్ని లంపి,—ఏడువారాల నగలతో ఏలికసానిగా వుంటూ తన కొలువడి చేసుకోవలసిందిగా చిన్నదానికి విన్నపాన్నంపించారయ్యా!

"అయితే, చిన్నదానితల్లి అందుకు 'ఊఁ' అనలేదు. సరికదా 'ఉహూఁ' అనీ అనలేదు. కాళ్లదగ్గర కొచ్చిన కట్నాలని కళ్లకద్దుకుని స్వీకరించింది.

"ఏలినవారు ప్రేమాభిమానాలతో పంపిన కానుకలు పుట్టింటి ఆడపడుచు పసుపుకుంకుమలుగా స్వీకరించింది. 'అయితే ఒక విన్నపం: ఏమనగా, బలము లేకపోయినా కలిమిగలిగిన చోట-కులహీనమైనా సరే, గుణహీనం కానిచోట-కళలలో ఘనత, కళ్లలో మమత కలిగుండి, సంగాచారాలు పాటించడంలో హీనపలేనిచోట-మనువుకూర్చి, తనువు చేర్చి, ధన్యను చేయమని చిన్నదాని కోరిక. పగలేక వగలేక ఒప్పని గుర్తించమని కోరిక' అంటూ ప్రభువులవారికి వర్తమానమంపించింది చిన్నదానితల్లి.

"వర్తమానం అందుకున్న ప్రభువువారు దైవం తెలుసుకురమ్మని హితుడు, పురోహితుడు అయిన భూసురశర్మని పంపించేరు.

"ఆ భూసురుడు వచ్చి చిన్నదాని తల్లితో—'పుట్టింటి ఆడపడుచు పసుపుకుంకం పుచ్చుకున్నందుకు ప్రభువులవారు సంతోషించేరు. అయితే పేన కొడలిని చేసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు నిశ్చతార్థం ముట్టలేదని కించపడుతున్నారు. జాగుసేయక ఆ ముచ్చట తీర్చవమ్మా!' అని చెప్పేడు.

'ప్రభువు లాంటి శిరసావహించడానికి ఎప్పుడూ సిద్ధమే. కాని పేచకోడలు కాదుకదయ్యా!' అంది చిన్నదాని తల్లి.

'అయితే కూతురు వరుసన్నమాట! ఇక నెం... కూతురి వరుస కూర్చవచ్చునే, పెళ్ళికూతురి వరుస!' అన్నాడు బ్రాహ్మణుడు.

'కాదయ్యా బాపడా! చెల్లెలివరుస చెప్పరాదు తలివరుస తలవరాదు; చెప్పరాని వరుస గనుక నే మనువు చూడమని మనవి చేసుకున్నాను.'

"ఈ రకంగా సంభాషణాదికాలు జరిగిన వెనుక అతడు వెళ్లి ప్రభువులవారికి విషయాన్ని విన్నవించుకున్నాడు.

"ఆ వెంటనే రాజగురువుని మహామంత్రిని పిల్పించి ప్రభువువారు వారితో ఆ విషయమై మంతనాలాడేరు.

"'నిజమే ప్రభూ! ఆ చిన్నది మీకు సోదరి. అయితే ఒకటి—ఆ మెమాత్రం చిన్నదానికి కన్నతల్లీ కాదు, కన్నతలీ కాదు. ఇదిఒక్కటే మాకు తెలిసిన రహస్యం. కాగా, జ్ఞాతులకారణంగా తమ జన్మరహస్యము వెలిబుచ్చడానికి సమ్మతించక మహారాజ్ఞి ఆత్మహత్య చేసుకున్నారు. అదే రీతిగా ప్రభువులు వారు ప్రాణత్యాగం చేస్తూ తమరిహస్యం మినహా యావద్విషయాలు చెప్పి దాటిపోయేరు. కనుక చిన్నదానికి సంబంధము చూడవలెం కర్తవ్యమే మహాప్రభూ!' అని మహామంత్రులు సెలవిచ్చారు.

"'అయితే అందుకు తగిన వరుడో?' అని ప్రభువువారు ప్రశ్నించారు.

"'ఉన్నాడు ప్రభూ! ఉన్నాడు. సాహసి, సహిష్ణు—జిజ్ఞాసువు, ప్రేమాళువు—కర్మిష్ఠి, కరుణ స్వభావుడు—బంధుపారధి, బహుజనప్రియుడు—దానశీలి, గానలోలుడు, కళావేత్త, విద్యలనిధి అయిన కళ్యాణ పురదీక్షాగురుని శిష్యోంభిగుడు చాలా యోగ్యుడయిన వరుడు. కానీ...'

"'ఏమిటి గురుదేవా! సందేహిస్తున్నారేమి?'

"'ఆ వర్ణగుణుని సంపన్న గృహస్థి! ఇందుకు సమ్మతిస్తారా?'

"'సంస్థానానికి చెందిన జమీందారులేగదా! అధికారికంగా కాకున్నా; అల్లునిగా అనుకున్నాం.'

"చిత్తం. అలాగే కానిద్దాం."

"ఈ ప్రకారంగా మంతనాలు జరిపినమీదట రాజమర్యాదతో రాజుగారి కదలికలాంఛనప్రకారం లగ్నపత్రిక పంపించేరు ప్రభువుగారు.

"విశ్వంభరంగారు ఒప్పుననలేదు, కాదనలేదు. అధికారపూర్వకంగాను, అభిమానపూరితంగాను ఇచ్చిన మహారాజ శాసనాన్ని మన్నించేరు.

"ఇకనేం— నాటి సంప్రదాయం ప్రకారం కత్తికి తాళికం కట్టించేరు; కులాచారం పాటించి కులపెద్దచేత కంఠాన్ని కుత్తిగంటు కట్టించేరు; తాషా మర్ఫాలు, మేళతాళాలు, బాజా భజంత్రీలతో జలగొడుగులు వేసి పల్లకిం పట్టించి కత్తిని కళ్యాణపురానికి పంపించేరు.

"కానీ, రాజాజ్ఞనే మన్నించేరు; రాచమర్యాదనే పాటించేరు తప్ప విశ్వంభరంగారు కత్తిని కన్నెత్తయినా చూడలేదు. సరికదా అటు పిమ్మట కూడా ఈ సంఘటన జరిగినట్టుగా జ్ఞాపకమైనా వుంచుకోలేదు. కారణం?

"ఆ రెండు విధాలయిన ఆచారాల ప్రకారం కత్తికి తాళికం, కంఠాన్ని కుత్తిగంటు కట్టిస్తే మామూలు ఆచారం ప్రకారం మనుగుడుపుల నిమిత్తం విశ్వంభరంగార్ని అక్కడికి తీసుకువెళ్ళేరు. వింత వినోదాలతో, నృత్యగానాలతో రాత్రి చాలా ప్రొద్దు పోయింది. సుమారుగా రెండుజాముల నిశి అయింది. అందువల్ల చిన్నది సంప్రదాయం పాటించింది. విశ్వంభరంగారు ఈ సంఘటన మూలంగా విముఖులైనారు.

"అంతే కాకుండా అదివరకే చిన్నదాని నాట్యవిద్యా నైపుణ్యం గురించి కర్ణాకర్ణిగా విన్నారు విశ్వంభరంగారు. పైగా వారు యౌవనంలో యాత్రా సంచారం చేస్తున్న సమయంలో—పదాల పారిజాతం, జావళీల జానకి, అష్టపదుల అన్నపూర్ణ, తిల్లానాల తాయారు, పెద్దాపురం పంకజాక్షి, పీఠాపురం సౌభాగ్యం, పాలూరు సామ్రాజ్యం, మాడుగుల మాణిక్యం, బద్దాం సుబ్బలక్ష్మి, కొట్టేటి రంగమణి, రాజోలు రత్నాంగి, మైసూరు మోహనాంగి, దక్షిణాది నాంచారి, ఉత్తరాది ఊర్వశి మొదలయిన నృత్యాంగనలందరినీ నాట్య విద్యాపాటవంతో ఆ చిన్నది దిగ్విజయం చెయ్యడం అత్యపూర్వమే ప్రత్యక్షంగా చూశారు. దానాదిగా విశ్వంభరంగారు చిన్నదాన్ని లక్ష్యపెట్టలేదు.

"ఏడాది గడిచినా ఏలినవారికి దయరాకపోవడాన్ని చిన్నది తల్లడిల్లింది. తల్లితో చెప్పింది. కళ్యాణపురానికి కమ్మరాసి పంపించింది. అందులో ఇలా వుంది.

'మోహాంబునిగారిన దేహంబుతోన
కొమరు మిగిలిన కాంత కమనీయముగను
తన మనఃపీఠిపై తమరూపు నిల్పి
తమ దివ్యనామముల్ తలపోయుచుండి
నిమిషమొక్క యుగముగా నెలత గడిపేను
అని సఖ్య చేత తా విన్నవించేను'.

"ఆ కమ్మనందుకుని కనికరంతో విశ్వంభరంగారి దేవేరి ఆ విషయాన్ని ఆయనకి నివేదించింది.

"ఆ సమయానికి తల్లితోను తగిన పరివారంతోను మేనాలో వచ్చిన చిన్నది తెరవెనుకనుండి సంభాషణ వింటూవుంది. విశ్వంభరంగారు తన మనస్సులో విషయాన్ని దేవేరి కెరింగించారు.

"'క్షమించాలి. నాపిగలవారు వంశమర్యాదలు పాటించడాన్ని తప్పుపడ్తారని భావించలేదు. కనుక నే కళలతో కావ్యాలు, విధులతో విద్యలూ చేర్పించడమే కాకుండా కులవిద్య నాట్యాన్నికూడా చెప్పించేను. కులాచారం ప్రకారం, గజ్జెలపూజ సంబరం, పైటసంబరం జరిపించినట్లుగానే కులపెద్దచేత కుత్తిగంటు కట్టించేను. కాసూ పోదూ అంటే విద్య చేర్చినందుకు దిగ్విజయం చేసింది; దేశానికి తన విద్యాపాటవం చూపించింది. ఇందులో అపచారమేదైనా వుంది అనుకుంటే అది తప్పు నాది కాని, చిన్నదానిది కాదు' అని చిన్నదాని తల్లి మనవి చేసింది.

"'మరి మనుగుడుపులనాటి ముచ్చటో?' విశ్వంభరంగారు ఎదురుప్రశ్న వేశారు.

"'అజ్ఞానం, పసితనంవల్ల ఆచారాన్నే పాటించింది తప్ప తప్పు తెలుసుకోలేకపోయింది. అది తెలిసినమీదట మందలించాను కూడా' అంది చిన్నదాని తల్లి.

నీయతే తోయ్యతే ఉత్క్షేంతి
క్రియతే త్యజ్యతే యతే.
(క్రియాపద ప్రాసకము)

"అస్తు భూగాణా త్స్వయ స్తపస్య
జగతో మంగళం శివం,
జహో జంతు గతో నాతి
తతి స్తపస్య తతో గతిః.
(భువనక్షాభాష)

"సర్వత్ర సంతతం పాయ
మతే పి సపది వ్యయం,
అవశ్యం యాతి మా మానం
సహసా వ్యః సదా సమం.
(అవ్యయాభాష)

"తను తే తను తే రాయం
విద్య గే విద్య తే రపి,
రాజనే రాజతే యం ధూ
ధంతే ధుతే కతా."
(పదాదియమకం)

ఇట్టేతని కవిత్వము మృగు మధుర పదబంధ యుక్తమై శబ్దార్థాలంకార సంయుక్తమయి చదువు వారికి మనోహరముగ నుండును.

"గాంభీర్యవానపి మహానపి భోగభూష్య
స్తారార్య తప్త జల సంకలిత ప్రముద్రః,
ఏతేన విశ్వజన తానిష్కృయతాం
మహాత్మ్యశీల జలేన సమః కథం స్యాత్."

ఈ శ్లోకము పైన నుదాహరించిన అచింతేంద్రవరుని వేయి స్తంభాల గుడి శాసనములోని "ప్రతాపో ఒపి మహాత్రా ఒపి" అను శ్లోకము ననుకరణము. శాసనకవులలో చూచి విట్టి యనుకరణము గమనింప దగినది. (సశేషము)

# స్వయంవర

శ్రీ దేవరకొండ బాలగంగాధర తిలక్

వాడటు నాదుస్వామి! తెలివాలుకనుంగవ రత్నదీపముల్
నీడల నీలిమం గదలు నిగ్గుల నిద్దపు కీవిదోచు, ఊ
గాడు కిరీటపుం గొనల కట్టిన కుచ్చుల మంచిముత్యముల్
చూడవె! శైలసానువుల సుందర వారిద చంచలాకృతిన్.

ఈ సుకుమారపు న్నడక నాటిన దీక్షడె సుమ్మి! మాలతీ
హాసమరీచి, మల్లియల యౌవనపు న్నునుసిగ్గు, ఏలకీ
వాసిత చిత్రపారథము, పండిన సంపగి తావి మైకమున్
ధూసరమయ్యెనే వలపు తోరపుపుప్పొడిజల్లు వెల్లువన్?

పరమణీయసంధ్య రచియించితికో యి కపోలతల్ప మం
దార సుధాత్రపల్; అవియె దాసినిగా యుపదల్ గ్రహింపుమ
య్యా రఘుచంద్ర! యీవలపు లంటిన లేతవయస్సులో మరే
తీరున నీయుదాన గుణింపగ నీవు మహార్ద్రచిత్తమున్.

తొలి తొలి జన్మలందు దయతో కలలో కనుపించి, కన్నులన్
వెలుగుల నింపి, చేత చెయివైచియు ప్రేముడి మీరు బాసలన్
పలికినవాడు నేటికిల వచ్చెనుగాక యథార్థమై, మరీ
పులకలు ఏమి నాతనువు ముంచును స్వర్గముదాకపాగుచున్!

ఇతడటే పుత్రకామేష్టి యాగఫలమ్ము
దశరథానంద నందనవనమ్ము!
ఇతడటే వెరపేది యింత వయసున రా
క్షసుల దున్మిన వాడి కత్తి మెరపు!

ఇతనటే రఘువంశ నితకీర్తి మద్గుణా
   వంశదల్ ప్రోవైన చారుశీలి!
ఇతడటే సాకేతనుతయావతవనమ్ము
   కన్నట్టి నిత్యావి కలలగుత్తి
ఇతడటే తండ్రి నన్ను నాగేటి చాలు
కదిపి వెలికి తియకముందె కానుపించె!
నేనెమొగాక, లేక జననమేల నాకు
స్వామి కోసము గాక నేనేమి కొరకు?

అతడు వచ్చెనో లేదో అల్లపందిళ్లవ
   ల్గడల పద్మాల తోరణాలు విరిసె;
అడుగు కదిపినంత పాల్లకమ్ములు పూచి
   వధి నెల్ల సౌందర్యవరసి జేసె;
పెదవి ఓర్నగవు తుంపెనలాడ మల్లెమొ
   గ్గలవాన జల్లు జల్లులుగ కురిసె;
వాని గన్నంత నాలోని గుబ్బిల్ల బ
   యలుపడి పసపు సిగ్గులను చిమ్మె;

ఇదివలపో! జన్మజన్మాల సహము సౌహా
ర్దమ్మొ! లోని ఆత్మలకిలో! దాచుకొన్న
పుణ్యమో! దోచుకొన్న వ్యరోగ్యమో! వ
విత్ర మీతుణ మీస్వామి వీక్షణమున.

ఏని చెంత చేరి విడువగలను నేను
సుఖము లేని; రాణి సొగసులేని;
ఏని పనుపుచాలు వెడలగలను నేను
అకవికేని; కడలి వడియకేని.

ఏలా కెప్పలు నంచలించు? పాపుల్ యింతేసి చిత్రమ్ము లౌ
నా? లేకన్ కనుగవ్వ మాంత్రికములా? నాలోన లోలో నవో
వేలావిస్తృత తంత్రులంగదలు; రానే వచ్చెలీ! స్వామి నా
పై లీలన్ పరపించె చూపులవి కవ్వల్ కుప్పు చేకిణలకా.

అదిగో సాగెను స్వామినీల్లుకయి, ఆ అందమ్ము ప్రాతస్సర
స్సరసోద్దీపిత రాజహంసవలె, అశాంతమ్ము శోభించు, కన్
తుదలన్ చూడవె! లోకకావధుల నాందోళించు క్రొవ్వెల్గు వం
పద లోహో చెలి! అతడే అతడు నా ప్రాణేశు డజన్మమున్.

తాకినవిల్లు తాకినటు దాశరథి ప్రథితాంగుళీయక
శ్రీ కిరణ స్థితిచే కరిగె చిత్రము నిచ్చెలి! నిక్వణ క్వణా
వ్యాకులమై ధనుస్సు- ఇటువంగిన నాయెద వింటితోడ కే
కీ కలహంసికా పిక శుకీరమణీయ నకాకలీ ధ్వనిన్.

హ్లాదహ శాహాళిన్ దివిని అప్సరలేమొ నటించి పుష్ప వ
ర్షాకర మిత్తు రివిధము; రా, చెలీ! క్రమ్మెను మైక మేదొ, యీ
మోదము దేహమందు నొకమూర్ఛనగా శ్రుతి నేయు; రమ్మ, న
న్నాదుము- పూలమాల నెటు లంటిట వైతును నాదు స్వామికిన్.

చాలదు లేవె యీ మొకద స్వామిమనోజ్ఞగళన్ గ్రహింప, నే
తాళగలేను నా బ్రదుకు దాకిన మోదశతాంరభార మా
కేలను పట్టకొన్న కటికీర్చిన రత్నపుకట్టలోని హుం
దా లోలయించు వాడిమొహ దాకొనలే మెరసెన్ మనస్సులో.

డుటు తప్ప, ఇతర సుగుణము లేమీ ఈ శుజానికి లేవు. మూఢగర్భము, అసాధారణ పరిస్థితులు, శస్త్రచికిత్సా భయము, తలి అందోళనము — వీనికి ఈ యోగము లెంతో తగియున్నవని చదువరులు గమనించక పోరు.

ఇట్లుండగా, ఆధానమైన వారము దినములకే, 5-1-1954 న తేదీన మకరరాశి 14° న భాగలో సూర్యగ్రహణము వచ్చినది. అనగా, ఆధానలగ్నము నకు కేంద్రగా ఎట ఎదుటనే! కరుణలేని, మహోతి ముఖకోపము, సంధ్యాసమయ వైషమ్యము. కల ఆధానకాల రవి తాను సంపాదించి యుంచుకొని యుండిన దోషములను గ్రహణకారణమున మరింతలు పెంచి ఆవాసు ఆధానలగ్నమునకు చేతులార అందించినాడనుట! రవి ద్వితీయ (మారక) స్థానాధిపతి అగుటచే, గ్రహణకాలమున కలిగిన ఆహార దోషములవలన కొంతేల, ఆ దోషము గర్భమునకు వ్యాపించి దానికి మూఢత్వమును తెచ్చి పెట్టినది. చంద్రుడు (లగ్నాధిపతి) ఇంద్ర సహవాసము లోనుండినా, గురు శుక్రుల శుభదృష్టియున్న కారణమున మూఢగర్భమైనా, క్రమమున పెరుగుచునే వచ్చెను, కాని, ప్రసవకాలములో దలవాదులను చూపక వైద్యుల కన్నులకు దుమ్ముగొట్టినది.

ఇది అట్లుంచి, ఆధానక్రమమునకు సంబంధించిన మరియొక్క విశేషమును గమనింతము. ఆధానదినమునుండి జననమువరకు ప్రతి నక్షత్రమాసాంతమున ఆధానలగ్నము ఉదయించు కాలమునకే చంద్రస్థానమును సాధించినచో, ఆ చంద్రునికి వచ్చు శుభాశుభ గ్రహదృష్ట్యాదుల మూలమున గర్భస్థపిండమునకు సంబంధించిన బాగోగులు గ్రహించవచ్చునను సంప్రదాయమున్నది. ప్రశంసలోనున్న ఆధానమునకు ప్రతి మాసాంత చంద్రస్థితి అనుబంధములో చూపబడి యున్నది. (అనుబంధమును చూడుడు.)

ఆధానారంభమునుండి నాక్షత్రమాసములు ముగిసిన తేదీలు అనుబంధములో మొదటికాలములో చూడవగును. ఆ తేదీలలో జన్మచంద్రస్థానము (అనగా, కర్కాటకములో 18°-31') ఉదయమగునట్టి కాలమును గుణించి, ఆ వేళకు సరియగు చంద్రస్థానమును సాధించుట ఈ ప్రయోగములో ప్రధాన సూత్రము. అట్లు సాధించిన మాసచంద్ర స్థానములు 1 నుండి 10 వరకు పట్టికములో కలవు. మధ్యమందున్న జీవితరేఖకు ఒక నెలలో ఒకవైపున, రెండవ నెలలో మరియొక వైపున చంద్రుడు క్రమముగా నిలుచుచు, అయిదవ మాసాంతమున మాత్రము జీవితరేఖపై నిలుచుట, తరువాత మరల క్రమముగా రెండు వైపులలో సంచరించుచు, ప్రసవకాలమున జీవితరేఖలోనే జన్మలగ్నముగా మారుట, అనునది సర్వసాధారణముగా జరుగు కార్యక్రమము. జీవితరేఖ చుట్టూ శంఖావృత్త క్రమమున యీ చంద్రుడు చేయు ప్రదక్షిణములు వక్రముగా జరిగి పంచమ మాసాంతమున జీవితరేఖపై నిలిచినచో, పిండము సక్రమాభివృద్ధి నొంది చలనము ప్రారంభించ గలదు. ఆ చంద్రునికి ప్రబల వేధలు వచ్చినప్పుడు, అతని సంచారము క్రమము తప్పి, డొంకలు తిరుగుచు, వైరూప్యములతో, ప్రబలవ్యాధితో సూచింపుచు, శిశువునకు గలిగిన వైషమ్యమును తెలుపగలదు. ఈ చంద్ర చారక్రమమునకు "ఆధానచంద్రావర్తన" మని సాంకేతిక నామము.

ప్రశంసలో నున్న ప్రణాళికలో, తృతీయ మాసాంతమున చంద్రుడు తన ప్రదక్షిణగతిని కొనసాగించలేక ముందుకే సాగి పోవుటయు, పంచమ మాసాంతమున జీవితరేఖను కలుసుకొనజాలక పోవుటయు, పాఠకమహాశయులు గమనించగలరు. ఆ కారణమువలననే, శిశువునకు చలనశక్తి కలుగ లేదు. ఎనిమిదవ నెల వచ్చునప్పటికి చంద్రుడు జీవితరేఖ నంటగా, చలనము ఆరంభమై, తరువాత రెండు నెలలు క్రమముగా పెరిగి, పదినాక్షత్ర మాసముల అనంతరము సుఖప్రసవము జరిగినది.

దేశమానదశాపద్ధతిలో ఆధానచంద్రుని చలనమును చిత్రింపుదము. మూడు నెలలకు రాహుకేతువుల మధ్యమునకు వచ్చుటచే, చీకటిక్రమ్మి, ఆ చంద్రుడు దారితప్పినాడు. అయిదవ నెలలో ఆ చంద్రుని పాదిరి పట్టి ఇంద్రుడు దూసుకొచ్చెను. పంచమమాసాంతమున చంద్రుడు ఇంద్రునిపైననే (తుల 23°-36') నిలుచుట తోడైనది. గర్భమునకు చలనశక్తి రాలేదు. వైద్యులు 'బల్ల' అని నిర్ణయించినారు. అది ఇంద్రుని మాయ, ఇంద్రజాలము! పది నెలలకు దలితచంద్రుడు చతుర్థాధిపతియగు దలితపుత్రుని అర్ధకోణ శుభదృష్టికి రాగా, సుఖప్రసవమయినది.

సరేకాని, అందరు ఆధునికవైద్య ప్రకాండులకు "టోపీ" వేసిన ఈ గర్భము ఒక ప్రాచీన సంప్ర

# అనుబంధము

## ఆధాన చంద్రావతరణము



# గురుశిష్యులు

శ్రీ మోచర్ల రామకృష్ణకవి

ఒక సెలయేఱు కానఁబడుచున్నది, కంటివె యాకుటింటికిన్
నికటమునందు: దానిదరి, నిద్దపు ఱాతి వితర్ది మీఁద ని
ర్వికృతి సుఖాసనస్థుఁడయి వెల్గెడి వాఁడె సమర్థ రామదా,
సిఁక మానసారఁ జేయఁగదవే యభివాదన మమ్మహర్షికిన్.

రారయ్య, యయ్యతీశుఁడు
చేరువకుం జేరి, గడియసే పాతనిఁ గ
న్నారం గని ధన్యత చే
కూరం జేసికొని చూడఁగొందము సుఖముగన్.

ఆరోహించితి మిఁక నౌక
బారెడు దూరమె తరియ పదసన్నిధి: యిం
దోంసిరి, తత్స్వరూప సు
ధారసముగ మనము గ్రోలుదము నయనములన్.

ఉడుతలు వృక్షశాఖలనుండి వడిగ దిగివచ్చి, కౌతుకం
బెసఁగ నీ తపస్వితనువంతయుఁ బ్రాఁకుచు నున్న వేమొకో!
పడిపడి మైఁ దదంఘ్రములపై నిటు చిల్కలు గోరువంకలున్
జడియక నిల్కడన్ నిలచి చంచువులన్ గిలిగింత వెట్టెనే!

జ్ఞాన విజ్ఞాన పక్ష సంధాన కలన
సూత్ర విక్షేప మెనయని శాంతి వడసి,
నిండుకొను సచ్చిదానంద మండలమున
నరుగుచున్నట్లు తోఁచె నీ పరమహంస!

వీనులఁ బడుచున్నది బ్ర
హ్మానందనినాద మొకటి: యదిరా! యిది యా
మౌనిమణి హృదయవీణా
గానమె యౌనేమొ! హాయిగా వినవయ్యెన్.

"చర్మపాంచాలికల్ నిర్మించి, యూపిరి
పోసి, మాదృశులను జేసినావు
మా చీకటింటికి మళ్ళి పోవని రెండు
దీపమ్ములను ప్రసాదించి నావు
నిత్య నూతనమైన నీ సృష్టి వైచిత్రి
నీక్షించుటకుఁ గన్నులిచ్చినావు
నిదుర మేల్కొను పూల నెత్తావులను ద్రావి
యుప్పొంగు హృదయంబు నొసఁగినావు.

కనికరించి, మధురకంఠము దయచేసి
నావు - మాట నేర్పినావు - నిన్ను
గూర్చి పాట పాడుకొనుటయే కద, నేను
జేయఁ గలిగనట్టి సేవ దేవ!

"వేదవీథి విహరించు నిన్ను నా
పలుకులు మెప్పింపఁ గలవటయ్య?
ప్రజ్ఞాన ఘనుఁడైన వానికి నీకు నా
యర్థముల్ గ్రాహ్యమ్ము లగునటయ్య?
విశ్వప్రబంధకవి ప్రభు నిన్ను నా
కవన మాకర్షింపఁ గలదటయ్య?
నారద ముని తాతగారికి నీకు నా
గాన మాదరణీయ మౌనటయ్య?

నేను ధన్యుఁడ నగుటకు నీ మహాత్మ
విద్యయును రాని మాటలు, నిచ్చకొలఁది
పాడుకొనుటయె - నా ప్రజ్ఞ బగలుపలను
వెయిపు గాదిది, మన్నింపవలయుఁ దండ్రి!"

శ్రుతిహిత భగవన్నుతి యీ
వినముల దశదిశలఁ దాండవించుచునుండన్
యతిపతిని గదిసె నిదిగో
ద్యుతిమంతుం డొకఁడు భక్తియుక్తుం డగుచున్.

సువిశాలం బగు ఫాలమండలము, ముదశ్శ్యామలానురాగోల్లస
న్నవకంజంబుల నవ్యకన్నులు, ధరక రక్షింప దక్షంబులై

న నీలోకమ్ములు, భ్రూయుగాంతరమునన్ ఖండేందు లేఖాకృతిన్
విప్పరా కుంకుమ రేఖ - యీ పురుషరత్నం బెవ్వఁడౌనో కదా!

పరిగ మెఱుంగు మేనిమిసిమిల్ గుఱి యుంచెడి యంబరమ్ము గో
ఫురిపు మనోజ్ఞ రూపమును బూటక మైనఁ గొని, పూజ్యుఁ డైన యీ
పురుషుని మౌళిపై పలిచి పొందికగాఁ దలపాగ యమ్యెఁ - బై
గరగరికల్ విలార్చునది కల్కితురాయివలెన్ విరాజిలున్.

తాను దాచిన యాణి ముత్యాలలోన
నిగ్గుఁ దేరిన కొన్ని సంధింప జేసి,
యింపు గుల్కు తురాయి చేయించి, యతని
పాగలోఁ జెక్కినాఁ డేమొ సాగరుండు!

'తేజువ మీఱు వైరి వితతిన్ ప్రబవినాశ మొనర్చు కాని భ
ద్రాకృతిణోద్యమంబునకుఁ దార్కొనఁ బోవని యుగ్రగీతుఁ డా
గైకొని యుండు నితఁ, డటుకాదియొకన్, దరుగుండు శత్రు ల
క్ష్మీకలితుండు గడ్డములు మీసము లూరక పెంచునే యిటుల్ ?

వీరము శాంతముల్ గలసి వీనియెడన్ నెలకొన్నయట్లు సొం
పారెడు మూర్తి పెంపు సరియౌ - మఱి నెన్నడ తీరులోని గం
భీరత కుంభినీపతి సుమీ యితఁడంచు వచించు - వచ్చుచు
న్నారదె కొంతికుల్ భటులు నల్వురు తత్పరతానుసారులై.

నిలిచి, యతఁడు మౌళి నలరెడు తలపాగఁ
దీసి భటుని కేల వేసినాఁడు -
అడుగుఁ దామరలకుఁ దొడిగిన పాదుకల్
విడిచి, మాని కడకు నడచినాఁడు.

ఈగతిఁ జని మునికాగఁడు
సాగిలఁబడి మ్రొక్కి లేచి సమధిక వినయో
ద్యోగమున నిలిచె నేత
ద్రోణీంద్రుని కించుకంత దూరములోనన్.

తాను జేసిన చేవన్న తల ధరించి,
నేలఁ బద్మాసనస్థుఁ డై కేలుదోయి
మోడ్చి, చూపులచేఁ దన్ను మోయుచున్న
వాఁడువలెఁ దోచు శిష్యుఁ తోడ గురుఁడు.

"ఓయి శివా, వత్సా, దీ
ర్ఘాయుష్యము గలిగి మెలఁగుమయ్యా, యార్య
న్యాయాగమ శాఖలు క్రొం
జాయలఁ జివురింపఁ జేయు చైత్రుఁడ వగుచున్.

"నీకు సేకరించుఁ గాక లోకేశ్వరి
మహితగతి సమస్తమంగళములు
దక్షిణాపథంబు రక్షితంబగుఁ గాక,
నిగ్రహముల నుండి నీకరమున!

"భవదీయ విక్రమములో
నివసింపంగాత జగము నిత్యమ్మును - భా
ర్గవి నీయనుగ్రహములో
నవరిల్లుంగాత యుల్లసమున శివాజీ!

"తోయమునఁ దైలబిందువు
తోయమునన్ నెరయు నోయి, తోరమ్మగు ధ
ర్మాయత్తమయి తవ కీర్తి
నీయశము సమస్త మేదినీచక్రమునన్.

"త్రైవిద్య వృద్ధులను శ్ర
ద్ధావిలసిత బుద్ధితోడఁ దప్పని సరిగా
సేవించు వినయధనులకుఁ
గోవిదులకు శుభము లరుదె గుణరత్ననిధీ!

"అవినయులై సుతహిత బాం
ధవయుతముగ నాశమందినారు నరేంద్రుల్
సవినయులై వనసీమల
నివసించిన వారు కనిరి నృపతిత్వంబున్."

అని ప్రబోధ వాక్కులను వెల్వరించు నీ
యవసరమునఁ దోచె నాకసమునఁ
బ్రాగ్దిశాంతరమునఁ బ్రత్యగ్ర సౌందర్య
కందమైన శక్ర కార్ముకమ్ము.

గుబ్బతిల్లెడు గున్నయేన్గులవిధాన
వాన మబ్బులు గుత్తులువాఱుచుండెఁ,

జనులఁ జెలరేఁగ సారంగ సంచయములు:
గిరి శిఖర మెక్కి పురివిప్పెఁ గేకి యొకటి.

"గురుదేవ, జలధరమ్ములు
త్వరపడుచున్నట్లు కానఁబడుచున్నవి: దే
వరవారు పర్ణశాలాం
తరమునకుఁ వేగిరముగ దయచేయఁ దగున్.

"చిటిపొటి చినుకులవోడిమి
యటుఁ దోపదు - కుంభవృష్టియడియాలంబుల్
స్ఫుటమయ్యెఁ: లెండు, గొడుగున్
భటుఁ డదె కొనివచ్చుచున్నవాఁ డిచ్చటికిన్."

అంతఁ జారుకాంతి యనురాగ మిగురింపఁ
గళితసంపుఁ జెంపు కందళింప
"శివకుమార, వాన చినుకులకీ లీలఁ
దగవు మాలి యులియఁ దగునటోయి!

"విన్నంబోలు గురుగ్రహ
ణోన్నిద్రుల కొక్క ధర్మ ముపదేశించున్
విన్ననువున వర్షంబిది
యన్నా, యెఱిఁగింతు దీని యర్థము నీకున్.

"పేర్మి నిటు శ్రావణాది చ
తుర్మాసములందు వేల్పుదొర వర్షించున్
ధర్మవిదుఁ డవనిపతి యటు
లర్మిలి నింద్రవ్రతంబు నవలంబించున్.

"అభిరతి వసుధకు సస్యము
లభివృద్ధికిఁ దెచ్చు వాన హరిహయుఁడిచ్చున్,
ప్రభుఁ డభినుతుఁడై యర్థుల
యభిమతములఁ దృప్తి దీఱ నభివర్షించున్.

"ఆగ్రహాయణికాది మాసాష్టకమున
నినుఁడు తోయమ్ములే తోయమున గ్రహించు
రశ్మిజాలమ్ములచే, నట్లు రాజు కరము
రాష్ట్రమునఁ గొను టదియె యర్కవ్రతంబు......

"అఖిల భూతంబులం జొచ్చి
యనిలుఁ డెట్లు సంచరించునో యాజాడ, చక్రవర్తి
చారముఖమున వర్తించి స్వాభికాంక్షి
తముల సాధించు, నిది మారుతవ్రతంబు.

"మిత్రులును శత్రువులు విష్టపత్రయమున
లేరు యమునకు, సమవర్తియై రహించి
ప్రియుల ద్వేష్యుల నియమించు - ఱేఁడు ప్రజల
నట్లు శాసించు, నిదియె యామ్యవ్రతంబు.

"బ ధనార్ష్ణవి వరుణుండు పాశబద్ధుఁ
జేసి దండించునట్లు శిక్షించు రాజు
పాపరాధుల నొగి సంశయంబు లేక -
నరపతుల కియ్యదియె వారుణవ్రతంబు.

"పూర్ణ రాకా సుధాంశుండు భూమిజనుల
చిత్తకుముదాళి వికసింపఁ జేయునట్లు
రాజు తనదర్శనము చేయు ప్రజలనెల్లఁ
బ్రముదితుల సల్పు టరయఁ జంద్రవ్రతంబు.

"ఖలు లగు సామంతుల గుం
డెలలో గాలముగ మెలఁగి, నిచ్చలుఁ బాపా
త్ముల కగ్గిరాముఁ డగుటే
యిల నాగ్నేయవ్రతంబు పృథివీపతికిన్.

"సమముగా స్థావరంబుల జంగమముల
భూతధాత్రి ధరించు, నారీతి నతఁడు
ప్రజలను ధరించు విస్తృతపాత బుద్ధిఁ
ప్రభువు - కావున నిది పార్థివవ్రతంబు."

అని యా వెరవునఁ దొరఁగిన
ముని ధర్మప్రవచనమున మునిఁగి, ప్రయత్న
మ్మున వెలువడిన శివాఖ్యుఁడు
పనివడి తనచూపు నాల్గువైపుల నెఱపెన్.

కలయఁ జూచి, మస్తకమ్ము ముమ్మాఱూఁచి
భ్రూయుగమ్ము నూర్ధ్వముగ నిగిడ్చి
వృద్ధుల నయనములు మఱింత పెద్దవిగా, వ
చించె గురునిగాంచి శిష్యుఁ డపుడు.

"అరయఁ డాయతివృష్టి సంయమి వరేణ్య!
మిన్ను మన్నేక మయినట్టు లున్నదదిగో,
అంబరము చిల్లివడకున్న నంబుధార
లలము నే యిట్టు లిది జలప్రళయ పోటు!

"గొప్ప మ్రాకులు కొట్టుకొని పోవుచున్నవి
కూఁకటివేళ్లతోఁ గూడ లేచి,
పెనుతరంగములతో వికట తాండవమాడు
వనపశ్వముల కళేబర చయములు,
గిరికూటములనుండి దొరలుచున్నవి క్రింది
కుగహ్వరమున గండోపలములు,
స్వీయరూపములు కోల్పోయె నిర్ఝరములు
నిర్జలతలమైన నెలవు లేమి,
నేల మట్టమెదియొ, శైలాగ్రమెద్దియో
వేఱుపఱుపరాని వెల్లి యట్లు
చుట్టుపట్ల నెగడఁ, జక్కని యీచెంత
రాలదేమి యబ్బురము మహాత్మ!"

అనుఁడు యోగీశ్వరుండు శిష్యుఁ జూచి,
చేరఁబిల్చి, "కుమార, యచ్చెరువుఁ గూర్చు
ఘటన లేదిట, సత్యసంకల్పుఁ డద్యుఁ
డఖిల కల్యాణ నిలయుఁ డీశునిది లేదు!

"పరమపురుషుఁ డనుము, పరతత్త్వమనుము, ము
క్తిస్వరూపుఁ డనుము, దేవుఁ డనుము
సకలశక్తు లతని స్వామ్యమ్ము, లేత దీ
రూపలబ్ధి కతఁడె చూపుదారి.

"బ్రహ్మ సాక్షాత్కృతింగన్న వాని కెదియు
గలుగ దవరోధ మతని సంకల్పమునకు
నన్యథాత్వము లేదు - సమస్త భూత
మయుఁ డతఁడు, తన్ని దేశ మన్నియును నెఱపు.

"అంత తెలిఁగిన పరమరహస్యమయ్యెఁ
గొందఱికె దీని కిటుకు దక్కును గదయ్య,
మహిని సర్వేశ్వరుని యనుగ్రహమె సుమ్మ
సకల యోగమ్ములకు సిద్ధులకుఁ బునాది.

"కీలక మిది - తెలిపితి, నీకఁ
జాలు శివా, ప్రొద్దుపోయె, సంతమసంబుల్
గీలుకొన, వీలుకాదిపు
డోలిక మీయూరి కరుఁగుఁ డుదయమ్మగుడున్."

అని యా రాత్రికి ఛాత్రునిఁ
దనకడ నిలుపుకొని మునివతంసుఁ డతనికిన్
బొనరించె విందును దపో
వనధి భరద్వాజమౌని భరతునికి వలెన్.

సౌధంబుల్ మణిదీపికల్ యవనికల్ శయ్యాదికంబుల్ కళా
ప్రాధాన్యంబులు వస్తుజాలములు సేవాదక్షు లర్థుల్ సుధా
మాధుర్యంబులు షడ్రసీరుచిర సంపన్నవ్య పానీయముల్
సాధిష్ఠంబులు భక్ష్యభోజ్య వితతుల్ ప్రాదుర్భవించెన్ ద్రుటిన్.

ఇట్లు మునివృద్ధు యోగ సమృద్ధి కలన
నద్భుతముగ సముద్భూతి నంది నట్టి
సదనమున రేయి సాగించి, యుదయ మగుడు
అనుచరులతోడ సెలవుఁ గైకొని శివాజి.

"...నా హృదయంబున సవికారంబుగ శ్రీ మహాభారతమునందలి యభిప్రాయంబు విన నభిలాష పెంపొందుచుండు

అమల సుదర్శ కృత్యం ఖుర
మై కపిలంబుల గోశతంబు ను
త్తమ బహు వేద విప్రులకు
దానము సేసిన తత్ఫలంబు త
థ్యము వదునూరు భారత క
థా శ్రవణాభిరతిన్ మదీయ చి
త్తము నవిశంబు భారత క
థా శ్రవణ ప్రవణంబ కావునన్.

జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధనిరూపితార్థ మేర్పడ
తెనుగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్.

అని యానతిచ్చిన విని యేను,

అమలిన తారకాపదమ
యంబుల నెన్నను సర్వ వేద శా
స్త్రముల యశేష పారము ము
దంబున బొందను బుద్ధి బాహు వి
క్రమమున దుర్గమార్థ జల
గౌరవ భారత భారతీ సము
ద్రము దరిజేరగ నీదను వి
ధాతృవశమైనను నెంబోలు నే?

అయినను దేవా నీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నా నేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద నని తొడంగి జగద్ధితంబుగా మహాభారత సంహితా రచనాబంధురుండనైతి — నంత కొండొక కాలంబున ఆ రాజమహేంద్రుండు నిగత జీవుండై దద్దయు దుఃఖించి నే, నేనిని మట్టలం బడుదు మహీపతి తోడ నా పోకుదని పరలోకమున కరిగితి నట......"

"ఉస్! ప్రాణం విసిగెత్తిస్తున్నారండీ నన్నయ్యగారూ! ఈపాత పురాణమంతా ఎందుకు ఏకరువు పెట్టడం ధిటాజాలాగ. కాగల కార్యమేమిటో — తొందరగా సెలవిస్తురండి. కలర్ ఎన్వెర్ టైజామెంటు కూడా ఉంటుట. పేపరు అరగంట ముందుగా వెళ్లాలి. చప్పున ముగించండి."

"విమలాదిత్య తనూజుడు
విమల విచారుడు కుమారవిద్యాధరుడు
త్తమ చాళుక్యుడు విధా
గమ విహిత క్రియుడు తుహినకరకుల కాంతిన్.

మహాభారత సంహితా రచనము నిఖిల లోక హితార్థంబుగా దత్తావధానుండవై పూర్తిసేయుమని వెండియు నానతిచ్చిన మామక విద్వరన్..."

"మామక ఏమిటండీ మామక; పీనుగలాగ! పూర్తి చేయడానికి పూనుకున్నారన్నమాట. అరాక, ఎందుకీ శ్రమ! ఇది వ్యావహారిక భాషాయుగం. మీ గ్రాంథిక రచనను, అందులోను భారతాన్ని ఎవరండీ మామాసీ వారు! ఇంతకూ మాది వ్యావహారికం పాలిసీ, ప్రభూ. కనుక, అలాటి రచనను ప్రోత్సహించడం లేదు. పకే గాని, చాపంతిలం. కాదంబరి మున్నగు రచనలున్నంటే రచనలుండగా, మీకు భస్మ అనువాదానికి భారతం ఎలా ఏరుకున్నారండీ? ఆశ్చర్యంగా ఉంది. గటె అంతటివాడు శాకుంతలం చదివి గంతు వేశాడు కదా! మీకు హృదయం స్పందించ లేదటండీ? అసూయ జాతీయత లేదు! వాట్ ఎ ఫూల్ హి కంట్రిమెన్!"

"ఆ గ్రంథము యభిమతంబైన కారణంబు చెప్పెద దత్తావధానులరై వినుండు.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవి వృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహి గొనియాడుచుండ
వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ చేసె భారతంబు."

"భారతం! మహాభారతం! వేదమే ట్రాష్! ఒన్ పర్సెంట్ పేస్. అలాంటప్పుడు భారతమేమిటండి వేదపారం! ఉపన్న ఉపన్న అని మహా ఇదిగా అంటారా! టాగోర్ కంటే బాగా చెప్పాడా వేదిక్ రైటర్! "ఉపానిషద్ ధని భాలో భాలో...అహా!"

"టాగోర్ అను కవీంద్రుండు..."

"టాగోర్ తెలీదటండీ? విశ్వకవి. నోబెల్ ప్రైజు కూడా వచ్చింది. ఇంతమాత్రం చరిత్ర తెలియకపోతే మీ పాండిత్యం ఏమిటండీ?"

"కొండొక..."

"అబ్బ! ఇంగ్లీషు రాదంటారేమండీ. మా మాస్టారుగారిలా 'దాదా చాపవేయాము. మరువాము మంచిదీ రండిమ్ము' - అని సల్లాపంలోను గ్రాంథికం ఎందుకండీ? దానిని మేము ఎక్కిరించకుండా లేవని ఇదివరకే హెచ్చరించానుగదా! ఇటీజ్ డెడ్! లెట్ ది ఓల్డ్ ఆర్కాయిక్ మాణస్క్రిప్ట్. నో యూజ్ ఆఫ్ కార్ప్షియయాపీ. కనుక నాతో ఏమాత్రం అవసరం ఉన్నా వ్యవహారికంలోనే మాట్లాడండి. సంతోషిస్తాను."

"ఇదియుం దొల్లి వ్యవహార్యతంబ..."

"అది వద్దన్నాను. నో ఆర్గ్యుమెంట్—అంటే వితండవాదం—వద్దు. మీరు విప్లవ కవి కావాలను కదా. మా భాషలోనే మాటాడండి. మీరు ఈ భారతానువాదం మా తలపై రుద్దబోకూడదు. చిన్నగా కాకూ కూడా స్వతంత్ర కల్పనకే అవకాశం లేకపోయింది. తెలుగింకెంద దొరలు వచ్చారు; కొత్త పోకడలు. కొత్త పోకడలు పారవశ్యంలో వచ్చాయి కాని, లేకపోతే నిఘంటువీరగా, ఫ్రాగ్మెంట్ గా ఉండిపోయేది కాదటండీ తెలుగు? సరే కాని. వ్యాసులు, వ్యాసులు అంటున్నారే? వ్యాసులెందరో తెలుసా మీకు? నాగరుకులలాగా ముగ్గురట. పురాణాలు కాపీ చేసిన వాడూ, సూత్రాలు క్రోడీకరించినవాడూ, ఆంతరం—అన్‌సైంటిఫిక్ ప్రిమిటివ్ హిస్టరీ చెప్పినవాడూ అని. మరి మీరు..."

"ముగ్గురూ ఒక్కరే కాదా?"

"ఆ! అదే అన్నాను, పిడివాదం మీదని. భారతక్షేపక! ఒక్క మానవజీవితంలో ఇంత పని సాధ్యం ఎలాగూ కాదు కనుక పాశ్చాత్యులు ఎంతో శాస్త్రీయ దృక్పథంతో ముగ్గురని నిర్ణయించారు. కాళిదాసులు కూడా ముగ్గురట తెలుసా?"

"అఁ! అఁ!"

"మరేమనుకున్నారు రీసెర్చి—పరిశోధన అంటే, కంటం పటుక్కుని భారతం—ఏదో అనాథ—రెస్ట్ కాపీ పట్టుకొని అనువాదం చేస్తూ పోవడం కాదు. నానాగ్రంథాలూ చూడాలి. నానాశ్లోకాలూ పఠించాలి కోశవావాచార్యః—అన్నారు."

"కాళిదా..."

"వద్దు. వద్దు. నాటకాలు మూడూ వ్రాసిన కాళిదాసు ఒక్కడు; కావ్యాలు వ్రాసినవాడొక్కడు; తక్కిన చిల్లర మల్లర రచయిత ఒక్కడు: —వరసే ముగ్గురు. కాళిదాసంటే జ్ఞాపకం వచ్చింది. మీరు కాళిదాసును కాపీ కొట్టారని, కొటేషనులైనా పెట్టకుండా పదాలు సంగ్రహించుకున్నారని కొందరు పరిశోధకులు అన్నారు. ఏమిటండీ మీకూ ఇలాటి బుద్ధులు?"

"ఏది చెప్పవాయనా?"

"ఏను అర్వర్థ మప్పైన మానవేశ
కడగి ఈ ప్రతి విప్రుడు నీ కడకు వేళ్ల
దండితోనే నిజిద కుండలమ్ము
రిత్త వాఫ్రాన్కి యుంచి విఫలమ్ము గాగ.

అనే పద్యంలోని 'అర్వర్థ మప్పైన' అనే మాటలను కాళిదాసుగారి రఘువంశంలోని 'అర్వర్థ మప్పి ప్రతిపాదయిత్వా' అనే శ్లోకంనుంచి కొట్టేశారటగా. ఇంకొటి కూడా అన్నారండీ దీపంనుండి ఏకో దీపం పుట్టింది అనే భావం కూడా తస్కరించారు మీరని..."

"అదా నాయనా!
నీ పుణ్య తనువు వలన
యీ పుత్రకు డుద్భవిల్లె యొంతయు నొప్పన్
దీపంబువలన నొండొక
దీపము పుట్టించినట్లు తేజం బెసగన్.
అనే కంద మనుకుంటాను."

"అదేనండీ, అదే. 'ప్రవరితో దీప ఇవ ప్రదీపాత్' అనే కాళిదాసుగారి మాటకు మక్కీకిమక్కీ అనువాదమే అటగా! అలాంటప్పుడు కాళిదాసు కావ్యాలే అనువదించి ఉంటే పోయేది?"

"గ్రంథచౌర్య మనేది ఏముంది నాయనా? గౌరవంకొద్దీ ప్రాచీనులనుంచి ఎన్నో గ్రహిస్తాము; ప్రయోగిస్తాము."

"బాగా ఉందండీ వరస! ఈ కాలంలో కాపీరైట్ అనేది చట్టం. దానిని ఉల్లంఘిస్తే మర్యాద దక్కదు."

"అమర్యాద ఏమీ లేదు నాయనా గౌరవంతో గ్రహించినప్పుడు."

సమయంలో...ఛందస్సు ఉత్సాహాన్ని చూపించ డానికి మంచిదే—తిరిగిం—వాడారనుకోండి. దట్ ఇజ్ ఎ బిహాల్ టు ఎన్ ఐడియా. హైయర్ థింగ్.

పలు దిబ్బంగుల పిండి వంటలు
బప్పుగూడును నేతి కుం
డలు గుడంబు నిధి ప్రపూర్ణ ఘు
టంబులుం గొని వచ్చి యీ
బలఘు పత్త్రుడు మాగుతాత్మజా
డన్నిటన్ గతి ఖేచుడై
బలముగల్గి కడంగె నప్పుడు
బ్రాహ్మణార్థము సేయగాన్.

సన్నివేశంలో చక్కగా, మహోజ్జ్వలంగా పరి గా త్రిరద్రి ఫీవిమింపలైన కాకపోయి విపుక్క విరుచు కుని పడినట్టు లేదూ ఆఖరున బ్రాహ్మణార్థము సేయ గాన్-అనేమాట?"

"బ్రాహ్మణార్థము అనే మాటకు శ్రాద్ధం అనే అర్థం ఎక్కడిది నాయనా? బ్రాహ్మణ ప్రయోజనం, బ్రాహ్మణకార్యం అని అర్థం. శ్రాద్ధనిమంత్రణం అనే అర్థం లేదే?"

"మరి కిష్కింధాకాండలో శ్రీ సీతారామాచార్యుల గారెలా ఇచ్చారు? మీ అంతర్మాత్రం తెలీ దా?"

"సీతా రామాచార్యులెవరు నాయనా?"

"ఆ! ఏమన్నారు? బ్రహ్మాండమైన తెలుగు నిఘంటువు వ్రాసిన ఆచార్యులవారే మీకు తెలీదా! సరే! మీతో వాదించి ప్రయోజనం లేదు. అన్నట్టు మరిచాను. ఆమహాకవి ఎలాగో అన్నట్టు మరీ పాతబడ్డ మాటలంటే మీకు మరీ మోజెందుకండీ? అరుణవారి-అని వాడారు కదా!

దారుణ జానువిండయమున
దండిర ప్రతిముండు భీకరా
కారుడు వాలివీవ్రలం
గంబోడెదెం గళితంబులో నవ
ద్వారములన్ మహోగ్రధిర
ధారలు తోరన నొల్కు మాంస పం
కారుణవారి పూరితను
లై పటికా విపినాంతరంబునన్.

ఏ శబ్దకోశంలో ఉందండీ ఈపదం? అరుణ వారి అంటే ఎర్ర నీరు కదా. ఏదో సాదృశ్యంగా వచ్చిం దంటే నమ్మకావాయ రక్తము అనే అర్థం. దాన్ని మీరు కావ్యంలోకి—ఐ మీన్ మీ అనువాదంలోకి ఎక్కించుకోవచ్చా?"

"అప్పటికి రూఢిలో ఉంది నాయనా?"

"ఎక్కడుందండీ? మరొక పదమూ ఇలాటిదే నందనం అనేది.

సరసతమాల తాల హరి
చందన చంపక నారికేళ కే
సర కదళీ లవంగ పన
స క్రముకార్జున కేతకీలతా
గరు ఘనసార సాల సహ
కార మహీరుహ రాజరాజితం
బర నవనందనావళుల
దత్పుర బాహ్యము లొప్పు జూపెన్.

నందన మని ప్రతి చీకిరి బాకిరి తోటకూ పేరు పెడితే ఇంద్రుడిన్ని, అతని సుందర నందన వనాన్ని ఇన్సల్ట్ చేసినట్టు కదా?"

"నందన......"

"ఆగండి. మరొక తమాషా పదం ఉంది! రచి యించు. ఏమిటండీ మీ టేస్ట్? రచన అనే అంద మైన పదాన్ని కవితకో, శిల్పానికో, మరొక లలిత కళకో వాడితే బాగుంటుంది కాని

ఇమ్ముగ విశ్వకర్మ రచి
యించిన కాంచన హర్మ్య శృంగ శృం
గమ్ముల రత్నకీలలు ప్ర
కాశములై కను బర్వె తన్నమి
సమ్మద బాలు దన్న ఘన
పంకులకుం దచిరద్యుతి ప్రతా
నమ్ముల గ్రేణి సేయుచు న
వారతమున్ విలసిల్లు దత్పురిన్.

అని,

విమల మణిమయమ్ములగు దూ
లములం గంబముల గోడలను వేసుల వ
ట్టిమముల జాటిన ప్రాకా
రములను గర మొప్పుచుండ రచియించె సభన్.

అని గోడలు కట్టడానికీ, మురుగు కాలువలు తవ్వడానికీ ఈ పదం వాడితే ఏం బాగుంటుంది?"

"రచన అనడానికి చేయడం అని సామాన్యార్థం నాయనా! కనుక నా ప్రయోగం...."

ప్రచారం? మీరు వ్రాసే చాదస్తమంతా పత్రికలో వేయాలా ఏమిటి కొంపతీసి? అది ససేమిరా సాధ్యం కాదు......"

"అదేమీ అక్కరలేదు నాయనా! దీనిలో జరిగిన వార్తలు ప్రచారంచేసిచాలు."

"ఏమి జరిగిందేమిటి?"

"ఇదిగో ఈ కల్పకపత్రంలో లిఖించుకొని వచ్చాను. చూడు నాయనా?"

"ఇదేమి భాషండోయ్? అంతుపట్టడం లేదు."

"తెలుగే నాయనా! లిపికూడ తెలుగులిపే."

"ఇది తెలుగులిపి అని ఎవరైనా అనే వాడుంటాడా? ఏదో శాసనలిపిగాని."

"శాసనలిపి అనేదేమీ లేదు నాయనా! శాసనాలలో వ్రాయడం, తాటాకులలో వ్రాయడం ఒకే లిపి."

"వన్నెకాడుగారూ, ఇక ఊరుకోండి. నాకెవ్వ నన్ను మోసం చేస్తాయంటారా? ఇది శాసనలిపి కాక మరేమిటి? దానిలో ఏమిటుందో మీరే చదివి చెప్పండి. ప్రకటన యోగ్యమైతే సంగ్రహంగా ప్రకటిస్తాము."

"విను నాయనా. శ్రీపతి యొక్క వాడు పారిజాతి తిరుమల..."

"హతోస్మి. మరీ అదేభాష. మీరు కదరకు. నేను కొన్ని ప్రశ్నలు వేస్తాను, సమాధానం చెప్పండి. విషయం వ్రాసుకుంటాను. కథ ఎక్కడ జరిగింది?"

"పారిజాతి తిరుచ్చాతునం."

"అబ్బ; పొతుఱ్ఱితి ఎందుకండీ న్యూసులలో. మీరు వ్రాసేది వార్తలేగాని మహాకావ్యం కాదు గదా!"

"ఎవరు అన్యకృతి వహించారు?

"వ్యద శీలసుకు"

# కాటూరికవి ఖండకావ్యాలు

**శ్రీ పి. గణపతిశాస్త్రి**

"వీరికవై జగన్నుతులకు
    కేతనముల్ పయి కొమ్మమీద శ్రీ
నీరొలు కొలనాడు కేతు
    వింటిన నఖర! మేలుకో! కృపా
కాల! శ్రీకామునోల! శ్రుతి
    పారదరత్నదవద్య! మేలుకో!
నీలనగోజ సత్రిత రమ
    ణీయ విలోకన! మేలుకో గడీ!"

శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు రచించిన 'గుడి గంటలు' ఖండకావ్యంలో మొదటి సువర్ణ ఘంటిక పై విధంగా మంద్రమధురంగా పాఠకుల హృదయాలలో ప్రతిధ్వనిస్తున్నది.

శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు జంటకవులై వెలయించిన సౌందరనందం సహృదయులందరికీ సుపరిచితమే. అంతకు పూర్వం వీరిరువురు రచించిన 'తొలకరి' ఆ రోజుల్లో అనువాదిత కవితాలోక చిరు తొలకరిగా మెరిసింది. సౌందరనంద ప్రచురణ తరవాత ఈ కవయిత లిద్దరు ప్రత్యేకంగా వ్యక్తిగత నామధేయాలతో వేర్వేరు ఖండ కృతులు కూడా సంతరించుకొన్నారు. శ్రీ పింగళి లక్ష్మీకాంతకవి కూర్చిన జగన్నాథ పండితరాయల కృతుల అనుసరణలు కొన్ని భారతి ప్రకటించింది. అయితే అరదనలేవి గ్రంథ స్వరూపం ధరించినట్లు కనబడదు.

కాటూరి వారి 'గుడి గంటలు' కొన్ని 'ఆంధ్ర శిల్పి' మొదలయిన సారస్వత పత్రికలు ప్రచురించాయి. ఈ కవి ఇతఃపూర్వమే రచించిన 'పౌలస్త్య హృదయము' ఒక చిన్న పుస్తక రూపంలో వెలువడింది. ఇటీవల మచిలీపట్టణంలో త్రివేణీ ప్రకాశకులు 'గుడి గంటలు' 'పౌలస్త్యహృదయము' కలిపి ప్రత్యేకంగా ఒక కవితా సంపుటి ప్రకటించారు. వీటితో బాటే ప్రకాశకులు, కాటూరి వారిటీవల రచించిన 'మేము' 'మా వాళ్ళు! మా ఊరు' 'కృతి సమర్పణము' కూడా ఈ సంపుటిలో చేర్చారు. ఈ విధంగా ఈ పుస్తకం కాటూరి కవి ఖండికల కొక చక్కని సంకలనంగా రూపొందింది. ఏకకాలరూపంలో కూర్చిన ఈ ఖండకృతుల వల్ల మొత్తంమీద ఈ సంపుటానికంతటికీ చక్కని అంగాంగీభావము, పరస్పర సమన్వయము ఏర్పడ్డాయి.

## ఆంధ్ర జాతీయత

ఈ సంపుటిలో చేర్చిన ఖండికలన్నిటిలోను కవి జీవిత దృక్పథం ఒక అంతర్వాహినిగా స్ఫురిస్తుంది. ఇందుచేత ఈ కృతులలో ఏది చేర్చకపోయినా ఈ సంకలనం కొంత అసమగ్రమై ఉండేదని కూడా అనిపిస్తుంది.

తెలుగువారి ఇలవేలుపులలో మొట్టమొదట పేర్కొనదగినవాడు శేషశైలవాసి శ్రీనివాసుడు. తరవాతి దైవం శ్రీరామచంద్రుడు. వారి వారి భక్తిప్రపత్తులనుబట్టి, కొందరి పరిగణనలో ముందువెనక లేర్పడవచ్చును. మొత్తం మీద ఏ తిరువురు మనవారి కగ్రగణ్యులు. ఎంతగా అభినివేశాలున్నా ఇతరదేవతలందరు వీరికి తరువాతివారే అనిపిస్తారు.

ఈ సంపుటంలోని పౌలస్త్య హృదయంలో శ్రీరాముడా రావణునికీ ఆరాధ్యదైవతమయినవాడు. 'గుడిగంటలు' ఏడుకొండలవానికి మేలుకొలుపులు. వారి జముల సంపదని దరిచేర్చుకొని దర్శనం ప్రసాదించ వలసినది కవి యీ ఖండకృతిలో ఆ దైవతాన్ని అర్థిస్తున్నారు. ఇక మిగిలిన ఖండకృతులలో కవి జన్మస్థలంలో కాటూరు గ్రామంలో పూర్వకాలంలో కుదరించిన అన్యోన్యతలు, సౌహార్దాలు ఎంతో ఆప్యాయంగా మనహృదయా లాకర్షిస్తాయి. కాటూరి కవి స్వకీయ వంశచరిత్రలో అలనాటి ప్రాచీనుల ఉదాత్త జీవితసరణి, ఆచారాలు సహజంగా చిత్రించారు. ఆనాటి సంప్రదాయాలు, మర్యాదలు, కవికుటుంబంలో అన్నదమ్ముల అన్యోన్యత, సౌభ్రాత్రము మన

# బొటనవ్రేలు

శ్రీ మండపాక రాజేశ్వరశాస్త్రి

## ప్రథమాంకం

స్థలం - వీరపురం రాజదర్బారు

సమయం - ఉదయం 8 గం॥

* * (దర్బారు హాలులో ఒకరొకరుగా పండితులు, వైదికులు, వైణికులు, గాయకులు, రాజోద్యోగులు, రాజబంధువులు, రాజదర్శనాపేక్షులు నేలపరచిన జంబుఖానాపై కూర్చుంటారు. అప్పన్నశాస్త్రి కొందరు శిష్యులతో వచ్చి సింహాసన సమీపంలో ఒకప్రక్కగా కూర్చుంటాడు.)

రామశాస్త్రి: (ఏదో శ్లోకం గొణుగుతూ వచ్చి కూర్చొని) ఏం వరదన్న సిద్ధాంతీ, అంత కళ లేదేం! ఏమిటోయి మేళంగి విశేషాలు! లోగిట్లో నుంచి పొందాగా పెళ్ళి జరిగి పోయిందే!

వరదన్న సిద్ధాంతి: ఆc- మీకు తెలియంది ఏముంటుంది లే.

రామ: అనేమన్నమాట - పెళ్ళివారిలో మీ మేనత్తగారి మొక్కిన వాడివి మనవ్వతే!- ఆc, మరిఎం శోక వలసా చేమిటి!

వెంకటశాస్త్రి: (నవ్వుతూ) పంభాళావు! నన్నడక్కోయ్ మామా. నేనూ మేళంగి పెళ్ళికి వెళ్ళినవాణ్ణేనూ! ఉండనే ఉంది శ్లోకం.

విశ్వైక దుర్మః కులపండితానాం
గుడుద్వయం కుంచెలపండితానాం।
వివాహయోగాణి నవిత్యగాణాం
లౌకిత్యతుం చిలర బ్రాహ్మణానాం॥

(అందరూ గొల్లున నవ్వుతారు)

(బోయిడాలు ముందునడుస్తూ తోవ చూపగా మీసం దువ్వుకుంటూ రాజుగారు ప్రవేశిస్తారు. సభలో అందరూ లేచి నిలబడి చేతులు కట్టుకుంటారు. కొందరు చేతులు జోడించి శిరస్సులు వంచి నమస్కారం చేస్తారు. రాజు ఆసీనులు కాగానే ఎవరి స్థానాలలో వారు కూర్చుంటారు. దివాను రంగనాయకులు మాత్రం చేతులు కట్టుకొని సింహాసనానికి ఎడమప్రక్కను నిలబడి ఉంటారు.)

రాజు: అందరికీ మా సుస్వాగతం! ఏం రంగనాయకులుగారూ!

రంగ: చిత్తం చిత్తం.

రాజు: అడవి గ్రామాలనుంచో? ఏమైనా దొరికిందా?

రంగ: చిత్తం చిత్తం మనకు పాము దాని బెడదెందో పోయినా ఉండనే ఉన్నాయి. ఈ విషయంలో మన్ముకు దండోపాయమే ప్రయోగించదలచి వచ్చింది. ఆవేశ ఉపాయంతో అందరూ లొంగిపోయి దాసోహ మంటూ మన కొరలు మన కాళ్ళదగ్గరికి తెచ్చి పోసి చెప్పారు. ఉపరి, దండుగకింద ఇలా యాభైరూపాయలు సమర్పించుకున్నారు.

రాజు: భేష్, భేష్! సంస్థానం పేరు నిలబెట్టవయ్యా! —మరి మా నగరం విశేషాలో?

రంగ: పాపం, గ్రామమంతా పంట పోయిందండి. ఈ కాలంలో వర్షాలు లేవు. ఆ వచ్చిన కొద్దిపాటి మేఘాలనూ గ్రామం పక్కనే ఉన్న కొండ అడివేసింది. ఫలితం—గ్రామంలో చాలాభాగం ఊడ్పులు కాలేదు. ఆ తర్వాత అతివర్షాలకి ఆ కొద్దిపాటి ఊడ్పూ ఊడ్చుకుపోయింది.

రాజు: సరే సరే—శిస్తులమాట చెప్పవయ్యా.

రంగ: అదే—పరిపాలనతో పరిస్థితులు మరిచి నేను కుంటున్నాను గాని—రాయితీమీద జాలిపడితే దివాణంపనులు జరుగుతాయా? పెద్దరైతు రంగన్న

మంగ: ఆహాహా! ఏమి వాద్యమయ్యా—ఏమి వాద్యం! దివ్యగానం! ఓహోహో!...(ఆనందంగా నిలబడి వింటూ ఉంటాడు)

అప్పన్న: (అలికిడి విని, తిరిగి చూసి) నమస్కారాలు మంగళావధానులుగారూ! ఏదో—తమరు జపంలో ఉంటే—ఏమో తొందర పెడుతున్నాను క్షమించాలి. (తల దింపుతూ) మాది వీరపురం. నా పేరు అప్పన్నశాస్త్రి. రామశాస్త్రిగారు తమ దర్శనం చేసుకొమ్మని చెపితే ఇలా వచ్చాను (అంగరఖా జేబులోంచి ఉత్తరం తీసి ఇస్తాడు.)

మంగ: శుభ మంగళాధికంగా! (ఉత్తరం అందుకుంటాడు. చెయిలనున్న అద్దాలపెట్టెలోంచి కళ్ళద్దాలు పైకి తీసి తగిలించుకొంటాడు. పొడుము కాయ రొంటె నుంచి తీసి పొడుము చేతులో గుమ్మరించి ఒకపట్టు ఘాటుగా పీల్చి పకలిస్తూ) కూచోండి శాస్త్రులుగారూ, కూచోండి. (ఉత్తరం గట్టిగా పైకి చదువుతాడు)

"బాబయ్యగారికి శతకోటి సాష్టాంగ నమస్కారాలు. ఈయన అప్పన్నశాస్త్రి, జగత్ప్రసిద్ధి చెందిన మహావైణిక శిఖామణి. వీరపురం సంస్థానాస్థానవిద్వాంసుడు. కొంతకాలంగా మీ సంస్థానానికి రావలసి వచ్చింది. వీరిని మన త్రికూటపుర మహారాజ దర్శనం చేయిస్తారని ఆశతో మీ వద్దకు పంపుతున్నాను. అనుగ్రహించండి—విధేయుడు—రామశాస్త్రి."

మంగ: (నవ్వుతూ) ఓసి, ఇంతేనటయ్యా! ఈ పాటి దానికి మా రాముడో చీటీ వ్రాయాలా? నాలుగు ముక్కలు మీరే చెప్పే పోవునే!...అప్పన్నశాస్త్రీ, వయస్సుచేత మీరు బాల్యులే అయినా, విద్యాప్రౌఢిమచేత మీరు మా అందరికీ వందనీయులే. మీ కీర్తి కర్ణాకర్ణిగా ఈ నగరంలో ఇదివరకే వ్యాపించి ఉంది. మా మహారాజులుంగారు మీ ప్రతిభ వింటున్నారు. మీ రిప్పుడు మంచిసమయానికి వచ్చారు. విద్వద్గోష్ఠి సభలు జరుగుతూ ఉన్నవి. రేపు సంగీత విద్యాగోష్ఠి. ఏమీ ఫరవాలేదు. అవశ్యం రాజదర్శనం చేసుకుందురు గాని.

అప్పన్న: తమ కటాక్షం!—ప్రస్తుతం సత్రంలో మకాం చేశాను. మంచి బసాకటి—

మంగ: సత్రం ఏం ఖర్మమయ్యా! మనింట్లో నైతే బాగా ఉండేవారు—ఇప్పుడే వెళ్ళి మీ పెట్టె బేడా తెచ్చుకోండి—మీతో మనిషిని పంపిస్తాను.

(అప్పన్నశాస్త్రి వీణను బరఖాలో ఉంచగా)

[తెర]

**5**

స్థలం: త్రికూటపురం రాజాస్థానం. సమయం: ఉదయం 8 గంటల తరువాత.

(దర్బారుహాలు విశాలంగా ఉంటుంది. హాలులో రెండు ప్రక్కలా వేదికలుంటవి. ఒక వేదిక మీద మంచి పనితనంగల దంతపు సింహాసనం ఉంటుంది. ఎదురుగా రెండవప్రక్క వేదిక మీద తివాసీలు పరిచి ఉంటవి. మిగ్గనున్న హాలు అంతటా తివాసీలు పరిచి ఉంటవి. సింహాసనానికి కుడివైపుగా వేద, తర్క, వ్యాకరణ, మీమాంస, మంత్రతంత్ర సిద్ధాంత, జ్యోతిష శాస్త్రాలలో ప్రవీణులైన పండితులూ, కవులు, గాయకులు, వైణికులు, మార్దంగికులు హిందూస్తానీ గానవిద్వాంసులు, ఇతర పండితులు ఆసీనులై ఉంటారు. ఎడమవైపున అన్య సంస్థానాలకు చెందిన ఉద్యోగులు, పురప్రముఖులూ, రాజదర్శనాపేక్షులూ, అన్యమతస్థులూ, అన్యదేశీయులు కూర్చుండి ఉంటారు.)

(సమంగా ఎనిమిది గంటలన్నరకు మహారాజు ప్రవేశిస్తాడు. మహారాజు రాగానే సభంతా లేచి నిలబడతారు. సభికులందరికీ రాజా నమస్కారం చేసి, చోపుదారు ముందు దారి చూపుతుండగా నడిచి సింహాసనం అధిష్ఠిస్తాడు. వెంటనే కొందరు వైదికులు నిలబడి వేదోక్తంగా ఆశీర్వచన పనసలు చదువుతారు. కొద్దిక్షణాలు అంతా నిశ్శబ్దంగా ఉంటుంది. మంగళావధాన్లు సింహాసనం సమీపిస్తాడు.)

మంగ: స్వస్తి శ్రీ శ్రీ శ్రీ మహారాజులుంగారికి. నిన్న ఏకాంతం ప్రభువులతో మనవి చేసుకున్న వైణిక విద్వాంసుడు శ్రీ అప్పన్నశాస్త్రిగారు తమ దర్శనార్థం సభలో వేచి ఉన్నారు.

అప్పన్న: (లేచి చేతులు జోడించి, వేదోక్తంగా ఆశీర్వదిస్తాడు)

రాజా: (చేతులు జోడించి ఆశీర్వచనం అందుకొని, చిరునవ్వుతో) అప్పన్నశాస్త్రిగారూ, మీకు సుస్వాగతం. మీ కీర్తి విన్నాం. మీ గానం వినాలనే కుతూహలం మా కెన్నాళ్ళనుంచో ఉంది. నేటికి ప్రాప్తమైంది.

కళావంతులవారి దగ్గర మంచిమాత్రమూ కాదు. నిజమేమంటే, నృత్యప్రదర్శనలకు వచ్చే పురుషులలో నూటికి ముప్పాతికమంది ఆనందించేది నృత్యంలోని శాస్త్రవిషయమూ లెంకమాత్రమూ కాదు. వ్యక్తి శరీరసౌష్ఠవమూ, మొదలైనవే వారి నాకర్షించేవి. దాఖలా చూడాలంటే కేవలం పురుషులచేతనే నృత్యాభినయ ప్రదర్శన లిప్పించి చూడండి ఎందరు ప్రేక్షకులు వస్తారో చిత్తగించండి.

రాజా : (నవ్వుతూ) బాగా చెప్పారయ్యా! నటకులు చేసినట్లు ఆడవేషం వేసేటప్పు, మొగాడు అభినయనృత్యాలు చేస్తే వీధిలో వెలుగుబంటి ఆడుతున్నట్లే ఉంటుంది స్త్రీలకే నృత్యం స్వభావసిద్ధంకదా.

వెంకట : కళావంతులకులాలు క్రమంగా నశించినా, ప్రజలకు నృత్యప్రదర్శనలమీద పిపాస తగ్గదు. మరి కళావంతులు నశించారు కదా, అందుచేత—

రాజా : పరిణామం తెలుస్తూనేఉంది ముందుముందు— ముఖ్యంగా పురుషుల ప్రోత్సాహంవల్లే—సంసార స్త్రీలే నృత్యం అభ్యసించడానికి పూనుకుంటారు. ముందు జరగబోయేదీ మనకు తెలుస్తూ ఉంది. ప్రతి ఊళ్ళోనూ నృత్యశాలలు వెలవవచ్చు. సంసారస్త్రీలూ, బాలికలూ ఈ నృత్యం కేవలం వెర్రిగా అభ్యసించనూ వచ్చు.

వెంకట : మరి—పురుషుల స్వభావం మారబోదు కదా? నృత్యం రంజించాలంటే వృత్తిగా పెట్టుకొని సాధన చెయ్యాలి కదా? నృత్యవృత్తి సంసార స్త్రీలపాలైతే, మరి కళావంతులకు వచ్చిన—

సింహా : మహారాజా, కాలవశాన మంచిచెడులు ఎలాగూ రాకేవస్తవి. ఇప్పటికే మాత్రం మా కళావంతుల కుటుంబాలకు భయంకలిగి ఈ విద్య మానుకుంటున్నారు.

రాజా : ఔనౌను. ఈ విపరీత పరిస్థితులు ఇతరవిద్యలలోనూ వస్తున్నవి. గాన వాద్యంగాది సంగీత విద్యలు దశకబారు చేతికి పద్ధతులలోకి దిగజారుతున్న చిహ్నాలు కనబడుతున్నవి.

వెంకట : ఈ అభిరుచులన్నీ అన్యప్రాంతాల నుంచి దిగుమతి అవుతున్నవే. అన్యప్రాంతీయులను అనుకరించడం ఒక వెర్రిగా పరిణమిస్తున్నది.

రాజా : సరే సరే. ఎప్పుడో జరగబోయేదానికి ఇప్పటినుంచీ బెంగెందుకు? మా పూర్వులూ, ఇలాగలా అనేకం లక్షణగ్రంథాలు వ్రాసి, ప్రచురించి వ్యాప్తిలోకి తెచ్చారుగదా. అవన్నీ ముందుతరంవాళ్ళు చదువుకొని ఆనందించనివ్వండి.

వెంకట : ఇప్పుడిప్పుడే గ్రంథాలు అచ్చొత్తించడం ప్రారంభమైంది.

రాజా : అదే, అదే. మనతరంలో లలితకళలు క్రొత్తరూపంలో సాగుతున్నవి. ముందుముందు వచ్చే వాళ్ళ సంగతి ఇప్పుడిప్పుడే ఏమి చెప్పగలం? —ఏదీ పిల్లలచేత కొద్దిగా—

సింహా : వెంకటరత్నంగారూ, పిల్లలను తీసుకురండి. (వారందరూ ఉమ్మడిగా స్తుతి చేస్తారు. సీతయ్య మద్దెలమీద వరసలు ఎత్తుకుంటుండగా

—: తెర :—

## 4

స్థలం – విక్రమపురం ఊరు సమీపంలో ఉన్న పూలతోట, సమయం సాయంకాలం.

(విక్రమపురం రాజాగారూ, అప్పన్నశాస్త్రి ప్రక్క ప్రక్కగా పూలబాటలో నడుస్తూ ఉంటారు. వెనకగా కొంచెం దూరంలో ముగ్గురు ఉద్యోగులు నడుస్తారు వారి వెనకగా సాయుధులైన సిపాయిలు నడుస్తారు)

రాజా: శాస్త్రీజీ, మా సంస్థానాలన్నీ చాలావరకు వర్ధించినవి. దివ్యభోగాలనుభవించాం. విద్యార్థులను రక్షించి వారి కుపాధులు కల్పించాం. విద్యా బృహస్పతులతోనూ, గానగంధర్వులతోనూ, నాట్యకళాకారులతోనూ మా సంస్థానం కీర్తిశోభించింది. ఇక్కడ జగత్ప్రసిద్ధిచెందిన జ్యోతిష సిద్ధాంతులున్నారు. స్తంభనాటకకులు కలిగిన మంత్రశాస్త్రవేత్తలున్నారు. ప్రతిభావంతులైన నటకులూ నాటకకర్తలూ ఉన్నారు. (నవ్వుతూ) మేమూ నటకులమే! నాటకకర్తలమే!.

అప్పన్న : అంతేనా? ప్రభువులు సర్వతోముఖ ప్రజ్ఞాధురంధరులే! మా వంటి అల్పులం ఎన్ని జన్మలో తపస్సుచేసి, ఉపాసనచేసి, ఈ జన్మలో విష్ణుసంభూతులు తమ ఆశ్రయం పొందగలిగాం. నా జీవితంలో క్రిందటిఏడు ఒక చెడ్డకలగా జరిగిపోయింది బొంతకుప్పలమీద పారే సామాన్యుడిని తూలికాతల్పం మీద శయనింపజేశారు ప్రభువులు. చారూ అన్న మెతుకునవాడికి కళ్యాణభోజనం సమకూర్చారు. ముప్పై తిరుమనుతిక పందిలు కట్టకొనిమాట అలవాటుతప్పించి ఉప్పాడచాపులే యిచ్చికట్టించారు. సాదు కొంపలలో పడి ఉండేవాళ్ళయి భవనాలలో మసలు భోగం పట్టింది—నా కేనా? నా వంటివాళ్ళెందరికో!.

రాజా: (ముఖంలో తృప్తికనపరుస్తూ) ఏదో... మేము మంచికో చెడుకో... పండిత పోషకులమనిపించుకున్నాంగదా—అందుకు ప్రతిఫలమూ

పిడికిలితో తలుపు తడుతూ) అప్పన్నశాస్త్రులు గారూ...
బాబూ అప్పన్న శాస్త్రులు గారూ!

వెంకన్న : (లోపలినుంచి) ఎవరది?... ఈ అర్ధరాత్రి తలుపు కొడుతున్నారు!

రంగ : మేమండి. పెబువులు పంపితే వొచ్చినాం.

వెంకన్న : (లోపలినుంచి) ఇప్పుడా! ప్రభువువారు రాత్రిళ్ళు ఎప్పుడూ కబురంపరే!

రంగ : అయితే మా మాట నమ్మరా?

వెంకన్న : ఏమన్నారు మహారాజు?

రంగ : పెబువు లిందాక కోటకొచ్చినారు. మాకు కబురు చేసినారు. మాం వుంటున్నాం. పెబువోర్ రన్నారూ, 'ఇది అప్పన్న శాస్త్రులుగారింటికి కెళ్ళండి. జల్దీ—ఇప్పుడే అరికి వంటబోవాల' అంటేంటా మేం అవోర్ని కొచ్చినాం.

వెంకన్న : (లోపలినుంచి) అయితే ఉండండి.

* * *

(లోపల హాలు—హాలు ప్రక్కగా గది—గదిలో ఒక వైపున కిటికీకి సమీపంగా పట్టె మంచం—రెండవ వైపున వీణలు, తంబురా, మద్దెలలు ఉంటవి. గోడలమీద ఏవేవో పటాలుంటవి. ఒక గోడమీద నిలువెత్తు సరస్వతి పటం వ్రేలగట్టి ఉంటుంది. మంచం మీద అప్పన్న శాస్త్రి గుర్రుపెడుతూ నిద్రపోతూ ఉంటాడు.)

వెంకన్న : (అప్పన్న శాస్త్రిని తట్టిలేపుతూ) గురువు గారూ!...గురువు గారూ!

అప్పన్న : (నిద్రమత్తులో పలవరిస్తూ) అచ్చెచ్చెచ్చే! అలా కాదు ఇలా కాదు. చూడు—సరిని సని—రిసని—సరిగరిగ—గరిగ—రిరిగ - సపరి- నినిస—ధనిస—సస్సా...

వెంకన్న :(నవ్వుతూ) మహానుభావా! ఈయన నిజంగా సరస్వతీ స్వరూపులే! ఈయన స్వప్న సుషుప్తులలోనూ సంగీతసాధనే కదా! (ఇంకా గట్టిగా తట్టుతూ) లేవాలి—ఓ మాటు లేవాలి.

అప్పన్న : (అటూ యిటూ కదుల్తూ) యిప్పుడు వీణ తియ్యలేనురా, రేపు రమ్మందూ.

వెంకన్న : (మళ్ళీ తట్టుతూ) మీ కోసం ఎవరో వచ్చారు.

అప్పన్న : (లేచి కూర్చుంటూ) కొంప తీసి—ఇప్పుడు వీణ వాయించమంటారేంట్రా, వెంకన్నా?

వెంకన్న : అదికాదు గురువుగారూ, ఎవరో మహారాజు దగ్గిర్నించి కబురు తెచ్చారు.

అప్పన్న : (బాగా తెలివివచ్చి) మహారాజుల దగ్గిర్నించా! ఎవరు కబురు తెచ్చారు?

వెంకన్న : ఎవరో—వీధిలోనే నిలబడి ఉన్నారు.

అప్పన్న : తలుపుతీసి వాళ్ళను లోపలికి రమ్మను.
(వెంకన్న హాల్లోకి వచ్చి వీధి తలుపుతీస్తాడు. రంగడూ సుబ్బడూ రామయ్య హాల్లో ప్రవేశిస్తారు. రంగడూ సుబ్బడూ వెంకన్నను పట్టుకుంటారు. రామయ్య వెంకన్న నోట్లో గుడ్డ కుక్కుతాడు. రంగడు తాడు అందించగా సుబ్బడు వెంకన్న కాళ్ళూ చేతులూ బిగించి కడతాడు. ముగ్గురూ హాలుంపట్ల అతనిని ఒక మూలపడేస్తారు. రంగడు వీధి తలుపు వేస్తాడు. ముగ్గురూ గదిలో ప్రవేశిస్తారు)

* * *

(అప్పన్న శాస్త్రి రామయ్యను, రంగడిని, సుబ్బడిని భయాశ్చర్యాలతో చూస్తూ మంచం మీద కూర్చొని ఉంటాడు.)

రామయ్య : (అప్పన్న శాస్త్రిని సమీపిస్తూ)—ఏం శాస్త్రి మహాశయా. బహుకాల దర్శనం!

అప్పన్న : మా వెంకన్నేడీ? మీరేమిలా వచ్చారు?

రామ: రాజాజ్ఞ సరేనండి—మిమ్మల్ని వీరపురం తీసికెళ్ళడానికి వచ్చాం

అప్ప: (భయభ్రాంతుడై వణుకుతూ) ఆఁ...ఆఁ... ఆఁ...వీరపురం!...వారికేం పనుంది, వీరపురంలో?

రామ: వీరపురం అనావైకి తీసుకెళ్లి కావడయ్యా? అలా అనుకుంటారేం?...మళ్ళీ మీ పని మీకిచ్చేశారు ప్రభువులు.

సుబ్బ: జీతం మరైదు రూపాయలు కూడా వేసినారండి.

అప్ప: ఏమిటి మీరంటున్నది—రామయ్యగారూ? అక్కడ ప్రభువు గెంటేసేశారు కదా, ఇక్కడ తలదాచుకున్నాను! వీరపురం విడిచేటప్పుడు తొందరా—ఇప్పుడు మళ్ళీ రమ్మని ఈ తొందరావా?...వెంకన్నా!

రామ: అయిందేదో అయిపోయింది. ఏ దుష్టుల మాటలు విని ప్రభువు లప్పుడలా శెలవిచ్చారో. నిజమే...కాని...మీరూ అలా వెళ్ళిపోయారో లేదో, ప్రభువులు—మా వారూ—ఎంత విచారించారనుకున్నారు! 'అయ్యో, అప్పన్న శాస్త్రి వెళ్ళిపోయాడా! మేం పొరపాట్లకన్న మాటలు నిజమే అనుకున్నాండా!' అని.

అప్ప: రామయ్యగారూ, మిమ్మల్ని బతిమాలుకుంటున్నాను. నా ఖర్మానికి నన్ను వదిలెయ్యమని రాజాగారిని ప్రార్థించాలని నా మాటలు రాజాగారితో మనవి చెయ్యండి. నా బ్రతుకేదో ఇక్కడ సాగిపడింది. ఇంత అంతో గౌరవంగా బ్రతుకుతున్నాను. కడుపు కింత తింటూ

# ఆర్థర్ కోయిస్లర్

"కోయిస్లర్ రచనలంటే నాకు ఇష్టం లేక పోవడానికి కారణం ఉన్నది: నేను ఏదైతే అపూర్వమని నమ్ముతున్నానో దానిని అతను సర్వ సామాన్యంగా పరిగణిస్తున్నాడు." రేమండ్ మార్టిమర్ (వ్రాసిన) వ్యాసంనుంచి పైవాక్యాన్ని ఉదాహరిస్తూ (Invisible Writing: Epilogue) కోయిస్లర్, తన జీవితం మధ్యయూరోపాదేశాలకు చెందిన మేధావు లందరి వంటిదేనని వాదిస్తాడు. 'యారో ఇన్ ది బ్లూ' (Arrow in the Blue-chap XII) గ్రంథంలో



అతను ఈ విధంగా వ్రాస్తున్నాడు: "నా ముఖ్య తరం ఏటికీ ముందు పరిచయమైనవారిలో సుమారు సగం మంది స్పెయిన్‌లో చనిపోయారు లేక డాచూలో హతమార్చబడ్డారు, లేక బెల్సెన్‌లో విషవాయువు ప్రయోగానికి గురి అయ్యారు. లేక రష్యాలో "లిక్విడేట్" చేయబడ్డారు: కొందరు వియన్నా బుడాపెస్ట్‌లలో ఆత్మహత్య చేసుకున్నారు, తక్కిన వారు తమ అజ్ఞాతవాసాలలో జీవితం శూన్యమైపోయి క్రుంగిపోయారు."

నిజాయితీగల ప్రతిభ రచయితా, కళాకారుడు, రాజకీయవేత్త, ఉపాధ్యాయుడుకూడా స్టాలిన్ నుంచి కాని, హిట్లర్ నుంచి కాని (లేక ఫాసిస్టు నియంతలనుంచి కాని) బహుకాలంపాటు ప్రమాదం తప్పించుకోవడం చాలా సామాన్యమైన విషయమని ఇతని అభిప్రాయం. ఇది నిజమే కావచ్చు కాని, కోయిస్లర్ జీవితం మాత్రం చాలా అసాధారణమైనదని ఈ వ్యాసకర్త అభిప్రాయం.

ఆర్థర్ కోయిస్లర్ 1905 లో హంగరీలో ఒక యూదుకుటుంబంలో జన్మించాడు. తల్లి జెకోస్లొవేకియా దేశస్థురాలు. తండ్రి హంగేరియన్. తాత రష్యానుంచి వలసవచ్చినట్లు తెలుస్తుంది. హంగేరియన్ లంటే జెకోస్లొవేకియన్లకు లోకువ కాబట్టి తల్లి ప్రాధాన్యంతోనే జర్మన్ భాష నేర్చుకున్నాడు. తండ్రి ఇంగ్లీషు, ఫ్రెంచి కూడా తెలిసినవాడు కనుక ఈ రెండు భాషలుకూడా నేర్చుకున్నాడు. అతని విద్యాభ్యాసం వియన్నాలో జరిగింది. ఇంజనీరింగ్ చదువుతూ పూర్తి చేయకుండా నే మానివేశాడు. రాజకీయ చైతన్యం తన 14 వఏట మొదట కలిగినట్లు 'యారో ఇన్‌ది బ్లూ' (Arrow In the Blue) లో వ్రాస్తున్నాడు. 1918 లో హంగేరియన్ విప్లవం జరిగింది. ఆస్ట్రో-హంగేరియన్ సామ్రాజ్యంనుంచి హంగేరీ విడిపోయింది. కౌంట్ కారోల్యీ క్రింద ఏర్పడిన ప్రభుత్వం రాజీనామా ఇవ్వడంతో కమ్యూనిస్టు బెలాకూన్ (Bela kun) అధికారంలోకి వచ్చాడు. ఇదిజరిగిన కొన్ని రోజులకు ముందు కమ్యూనిస్టుపార్టీ బుడాపెస్ట్‌లో అంత్యక్రియాత్మక ప్రదర్శనం చేసింది. ఈ ప్రదర్శనం ఒక శవయాత్ర (Funeral procession) బ్యాండువాళ్ళ షోపెన్ (Chopin) రచించిన మార్చ్ ఫ్యూనెబ్రే (Marche Funebre) గీతం కొందరు కార్మికులు వాయించారు. "కమ్యూనిజంతో నాకు కలిగిన ప్రథమ పరిచయం ఎప్పటికీ నా మనస్సులో షోపెన్ ఫ్యూనరల్ మార్చ్‌తో కలిసిపోయి ఉంటుంది." "కమ్యూనిజమ్ అనే మాటకు అర్థం తెలియడానికి పూర్వమే నన్ను షోపెన్ కమ్యూనిస్టుగా మార్చివేశాడు"[1]

---

1. —"My first contact with communism is forever associated with Chopin's Funeral March." "Chopin made a romantic Communist of me long before I knew what that word meant." (Arrow In The Blue. ch. 8, PP. 60, 61.)

క్రమంగా కమ్యూనిస్ట్ భావాలతనిని ఆకరించి ఉండవచ్చు. విశ్వవిద్యాలయంలో కేవలం ప్రమాదవశాత్తు అతనికి జియోనిస్ట్ (Zionist) సిద్ధాంతాల పరిచయం కలిగింది. వియన్నాలో విద్యార్థులు శిక్షణ చేయటం పరిపాటిగా ఉండేది. అక్కడ యూదుల పైన ప్రకటించబడే హేయభావాలతనిని కదిల్చివి. "జూడాయిజమ్ (Judaism) నన్ను ఆకర్షించలేదు. జూడాయిక్ సంప్రదాయాలకు సంబంధంలేని మిశ్ర వాతావరణంలో నేను పెరిగాను. హంగేరియన్, రష్యన్, ఫ్రెంచి, ఇంగ్లీషు సాహిత్యాలు నా బుద్ధికి ఆహారంగా ఉండేవి." "జూడాయిజమ్‌ను గురించి తెలిసి కొద్దీ నా మనస్సు మరీ కలత చెంది పోయింది. జియోనిజమ్ పట్ల నా ఉత్సాహం ఎక్కువ అయింది. నేను చెప్పలేని ఒక 'వ్యాధి'కి జూయిష్ దేశం 'చికిత్స' అని భావించాను: ఎందుకో కాని ఈ 'వ్యాధి' యూదులకు ప్రత్యేకమైన దేశం లేకపోవడమే నని అనుకున్నాను." "ఆ దేశం ఏర్పడినప్పుడు 'చికిత్స' పూర్తి అవుతుంది. అన్నీ సర్దుకుంటాయి"2

1924 ప్రాంతాలలో, కోయిస్లర్ తండ్రి వ్యాపారంలో నష్టపడి పోవడంవల్ల అతని చదువుకు కొంచెం ఆటంకం కలిగింది; కాని పూర్తిగా నాశనం కాలేదు. క్రమేణా అతనికి ఇంజనీరింగ్ మీద ఆసక్తి తగ్గి 1926 లో కాలేజి వదలివేసి, వియన్నాను వదలి, పాలెస్తీనుకు బయలుదేరి వెళ్ళాడు. కొంతకాలం ఒక కమ్యూనులో పనిచేసినా అతనికి ఆ వాతావరణంలో ఏమాత్రం కుదరలేదు. ఒకసారి ఆత్మహత్య చేసుకోవాలని నిరాహారదీక్ష మొదలుపెట్టి ఒక స్నేహితుని మూలాన మానివేశాడు—అప్పటికి అతను పాలెస్తీనులో నిమ్మకాయలు అమ్ముకుని బ్రతుకుతూ ఉండేవాడు. ఇంతలో రివిజనిస్ట్ (Revisionist) ఉద్యమానికి కార్యదర్శిగా బెర్లిన్లో ఉద్యోగం దొరకడం, తిరిగీ యూరోప్ ప్రవేశం జరిగింది. తరువాత ఒక పెద్ద వార్తాపత్రికకు ప్రతినిధిగా మధ్య ఆసియా పర్యటన చేశాడు. జియోనిజమ్ పై నమ్మకం తగ్గటంవల్ల సైన్స్‌కు మళ్ళించుకున్నాడు. 1931 లో ఈ పత్రిక అధిపతులు అతనిని తమ సంస్థ విజ్ఞాన సంపాదకునిగా నియమించారు. అందువల్ల తిరిగి బెర్లిన్‌కు బదిలీ అయినాడు.

నాజిజమ్ విజృంభించిన కొలదీ కమ్యూనిజమ్ కోయిస్లర్‌ను ఇంకా ఆకర్షించింది. "ఏదైన ఒక నిర్ణయానికి అనుకూలమైన ఆలోచన ప్రేరణ ద్వారా రావచ్చును, లేక ఇతర అనుకూల పరిష్కారాలను తోసివేసి రావచ్చును... మధ్యతరగతి లిబరల్స్ తమ సిద్ధాంతాలను వదలి విశ్వాసఘాతుకులవడం చూశాను. నాజిజమ్‌ను అరికట్టాలంటే సోషలిస్టులతో గాని కమ్యూనిస్టులతో గాని కలిసి తీరాలనిపించేది. ఈ సందర్భంలో నేను కమ్యూనిస్టు సిద్ధాంతాలను శ్రద్ధగా చదవడం ప్రారంభించాను." 3 కాని కేవలం అభిమానిగా ఉండడమే కాక పార్టీ సభ్యునిగా మారటానికి కొంచెం చిత్రమైన కారణం ఉన్నది. యారో ఇన్ ది బ్లూ (Arrow In the Blue) లో ఒక సంఘటనని ఇలా చెప్పాడు: 1931 డిసెంబరులో ఒక రాత్రి ఇంటికి వెళ్దామని బయలుదేరగా తన కారు కీలు వదిలివేసినని తెలుసుకొని ఒక అమ్మాయితో ఆమె ఇంటికి వెళ్ళి రాత్రి అక్కడ ఉండిపోయాడు. తెల్లవారగానే తప్పు చేశానే భావం అతనిని ఆవరించింది. ఈ విధంగా తనను గురించి వ్రాసుకున్నాడు: "నేను పెద్ద ఆత్మవంచకుడినని స్పష్టంగా తెలుసుకున్నాను; విప్లవానికి కేవలం ముఖస్తుతి చేస్తూ బూర్జువా జీవితం గడుపుతూ, పైకి రావడానికి ప్రయత్నిస్తూ... అక్కరలేని శయ్యలలో వాలుతున్నట్టు కనిపించింది"4

2. —'Judaism did not attract me. I was brought up in an assimilated environment without roots in Judaic tradition My mind had been fed on Hungarian, Russian and English literature." "—the more I found about Judaism the more distressed I became—and the more fervently Zionist. The Jewish State was the only cure for a sickness which I could not name or define but which seemed intimately connected with the Jews' lack of a country—." "When the Jewish State was established, the cure would be automatic and all would be well."

3. "We may arrive at a decision by a positive impulse or by elimination of other positive solutions—I had seen the liberal middle class betray its commitments, throw all its principles overboard. Active resistance against the Nazis seemed only possible by throwing in one's lot with the socialists or the communists Against this back ground I now began to study communist literature in earnest. (A. I. B. ch 26, 27. PP 229, 230.)

4. I saw myself with great clarity as a sham and a phoney, playing lip-service to the Revolution—and at the same time leading the existence of a bourgeois careerist, climbing the——ladder of success—landing in strange beds. (A. I. B. ch. 35, PP 305.)

ఈ సంఘటన పార్టీ సభ్యత్వానికి దరఖాస్తు పెట్టడానికి దారి తీసింది.

1932 లో పార్టీ అతనిని సభ్యునిగా స్వీకరించింది. ఆ రీతిగాను రహస్యంగా పనిచేయడం మొదలు పెట్టాడు. అది తెలియగానే పత్రికాసంస్థవారు పనిలో నుంచి తీసివేశారు. కొంతకాలం పార్టీ 'సెల్' (Cell) లో పనిచేసి, 1932 లోనే రష్యా ప్రయాణం ప్రారంభించాడు. తను అంతకుముందు పనిచేసిన ఉల్ స్టెన్ (Ullstein) పత్రికాసంస్థ ఈ ప్రయాణపు ఖర్చులను కొంతవరకు భరించడం ప్రజాస్వామ్యంలోని విచిత్రాలలో ఒకటి అని కోయిస్లర్ అంటాడు. రెడ్ డేస్ (Red Days) అనే పుస్తకరూపంలో తన ప్రయాణానుభవాలను వ్రాసి పార్టీకి ఇచ్చాడు. 'సోషలిస్ట్ రియలిజమ్' (Socialist Realism) ఈ రచనలో పుష్కలంగా ఉన్నప్పటికీ పార్టీ ఆదరణ పొందలేదు.

నాజీలు అధికారంలోకి రావడంతో యూదులు జర్మనీ విడిచి పారిపోవలసివచ్చింది. 1933లో కోయిస్లర్ పారిస్ కి వెళ్ళిపోయాడు. విలీ మున్ జెన్ బర్గ్ (Willy Muenzenberg) అనే కమ్యూనిస్టు వారికోసం పని మొదలు పెట్టాడు. 1934 పార్టీకి సంబంధించిన 'ఇన్ గా'(Inga) అనే సంస్థలో ఉద్యోగం దొరికింది. ఈ సంస్థ నాజీ వ్యతిరేకమైన ప్రచారం చేసేది. కాని దానికి కావలసిన ఖర్చులకోసం చందాలవల్ల సేకరించేవారు. జీతాలు లేకపోయినా 'టాం' ఖర్చులూ, మధ్యాహ్నంపూట సూప్ (Soup) ఇచ్చేవారు. కోయిస్లర్ ఈ కాలంలో రోజూ ఒకరొట్టె, కొంచెం కొద్ది తిని బ్రతికేవాడు—నడిచి ట్రామ్ ఖర్చుతో రొట్టెలు కొనుక్కు తినేవాడు. మరోసారి ఆత్మహత్యకు ప్రయత్నించి విఫలుడయ్యాడు.

సార్ (Saar) లో ఒక వార్తాపత్రికను నడపమని పార్టీ అక్కడికి పంపింది. సార్ లో నాజీలు అధికారానికి రావడంతో ఈ పత్రికను మూసివేసి తిరిగి వచ్చేశాడు. ఈ సంఘటనను కోయిస్లర్ వ్యంగ్యంగా వివరిస్తాడు. "సార్ లో నాజీలకు 90% పైగా ఓట్లు లభించినవి ..' "(కమ్యూనిస్టు పత్రిక మొదటి పేజీ శీర్షిక) సార్ లో హిట్లర్ ఓటమి అని వ్రాశారు" "క్రింది వ్యాసంలో, నాజీలు తమకు 98% ఓట్లు వస్తాయని చెప్పుకున్నారు కనుక అవి వారికి తార్కికమైన ఓటమి అని వ్రాయబడింది. తన పత్రికను గురించి ఇలా వ్రాశాడు. "My own comic weekly was dialectically a lasting achievement though mechanistically it lived only for one issue" 6

1936 లో స్పెయిన్ అంతర్యుద్ధం ప్రారంభమయింది. కోయిస్లర్ కి 'రిపబ్లికన్' సైన్యంలో చేరాలని ఉండేది కాని పార్టీ ఇంకొక పనిమీద పంపింది—జర్నలిస్ట్ (ఫ్రాంకోకు ఇటాలియన్, జర్మన్ ప్రభుత్వాల సహాయం అందుతున్నట్టు రుజువులు) సేకరించడానికి గూఢచారిగా స్పెయిన్ కు వెళ్ళాడు. కాని అక్కడినుంచి పారిపోవలసి వచ్చింది. ఇంగ్లండు చేరుకొని అక్కడనుంచి స్పెయిన్ కు తిరిగి పయనమయ్యాడు. ఈ సారి సరియైన పత్రాలు (Documents) ఉండటంవల్ల కొంచెం ఎక్కువకాలం పట్టుబడకుండా తిరుగగలిగాడు. కాని, ఫిబ్రవరి 9వ తేదీ ఫ్రాంకో ప్రభుత్వం అతనిని బంధించింది; అప్పటికి అతనికి తెలియకపోయినా, మరణదండనకూడా విధించింది. మే నెల 14వ తేదీ ఖైదీల మార్పిడిలో విడుదలయి ఇంగ్లాండుకు వెళ్ళిపోయాడు.

కమ్యూనిజంమీద అతనికి విశ్వాసం సన్నగిల్లిపోవడం ఇప్పటినుంచేనని చెప్పవచ్చు. తన భావాలను సంక్షిప్తంగా తెలుపగలిగే కొన్ని వాక్యాలను "డార్క్ నెస్ ఎట్ నూన్" (Darkness At Noon) అనే నవల నుంచి ఉదాహరించి తన కోర్కెలు ఏవిధంగా దృఢపడ్డాయో చెపుతాను. 7

"వ్యక్తికి స్వేచ్ఛలేదని పార్టీ చెప్తుంది—కాని అతనివ్యక్తిత్యాగం చేయాలని ఆజ్ఞాపిస్తుంది. రెండు వికల్పాలమధ్య అతనికి స్వేచ్ఛలేదంటూనే ఈ రెండింటిలోనూ సరియైనదానినే ఎంచుకోవాలంటుంది. మంచిచెడులమధ్య విచక్షణచేసే హక్కు లేదంటూనే, ద్రోహాన్ని, నేరాన్నిగురించి మాట్లాడుతుంది."

"సాంఘిక సమీకరణం (Social equation) లో ఒక జీవితంయొక్క విలువ శూన్యం అని పార్టీ

---

5. and 6. "—The Nazi obtained over 90% of the votes." ("The front page of the communist paper carried a headline) which read—HITLERS DEFEAT ON THE SAAR—." "The article explained that dialectically the Nazis suffered a defeat because thay had obtained only 90% of the votes instead of the 98% which they boasted they would get. (Invisible Writing ch. 15 P 272.)

7. The party denied the freewill to the individual—and at the same time extracted his willing sacrifice. It denied his capacity to chose between two alternatives—and at the same it demanded that he should always chose the right. It denied his power to distinguish between good and evil—and at the same time spoke accusingly of guilt and treachery. (Darkness At Noon.)

చాలా ఆశ్చర్యకరమయిన విషయం మనిషించదమ్మ." "రాజకీయ విశ్వాసాలను (సిద్ధాంతాలను) పరీక్షించాలంటే, వాక్ బుద్ధి వ్యాపారాలను దాటి మనస్సులో దాగిపోయిన మూలాలను అందుకోవగలగాలి '[10]

"ఇన్విజిబుల్ రైటింగ్" (Invisible Writing) లో ఒకచోట ఈ విధంగా వ్రాసుకున్నాడు. "I knew Nemeth was an artist and that I was a Journalist." కోయిస్లర్ ల 'రొమాంటిక్' ధోరణి తక్కువైనా ఉన్నాయేమో కాని అతనిని హ్యూమనిస్ట్ అనడంలో నిజం ఎక్కువ ఉన్నది. కోయిస్లర్ చిన్నప్పుడు హంగేరియన్ భాషలో వ్రాసేవాడు. తర్వాత సుమారు పదహారేళ్ళు ఏడుతుంటి 1940 వరకూ జర్మన్‌లో వ్రాసేవాడు 1940లో తన మొదటి ఇంగ్లీషు పుస్తకం వ్రాశాడు; ఈ మూడు భాషలలోనూ దర్యాప్తిగా పేరుపొందాడు. అతని ఇంగ్లీషు వచనశైలి తెలియని ఏ విషయం ఫ్రెంచ్ ఆ భాషలో వికీరా రాడ నే ఏంతో కొంత నే తెలియును. అతనిని గురించి వి. ఎస్. ప్రిచెట్ ఈ విధంగా వ్రాశాడు. "కోయిస్లర్ పదాలను బుద్ధి వ్యాపారం ఎక్కువ కాకుండా ఉండేటందుకు, మనం కమ్మరి కొలిమిలో కోకి, పనిముట్లలాగ వాడుతాడు. అందులో శాస్త్ర ఆర్థిక శాస్త్ర పరిభాష ఎక్కువగా వాడుతాడు." "కోయిస్లర్ స్వరం, అత్యంత హితమైంది. సజీవంగా, ఉత్సాహంతంగా, విసుగుపుట్టించకుండా ఉంటుంది. కాని ఇది అతని స్వరం మాత్రమే. అతని శైలి పొడిగా ఉంటుంది." "తన భాషలో వ్రాయని ఒక దయనీయమైన ఈ అశ పరిస్థితుల్లో ఉన్న వ్యక్తిని విమర్శించడం న్యాయంకాదు. కాని అతనికి భాష ఏ విధమైన అటంకము కాదు, భాష కేవలం ఒక పరికరం." కాని[11] "This latent apprehension, the awareness of guilt and impending punishment seemed always to be present, like the rhythmic beat of the surf at night along the shore." "—the waves will never stop beating their heads against the stones of the pier." అనేక కావ్యాలను పరిశీలిస్తే, కొంతమంది తీరగా వున్నా, కవిత్వం అసలు లేదనడానికి వీలులేదు.

యారో ఇన్ ది బ్లూ (Arrow In The Blue) లో కోయిస్లర్ తన జీవితాన్ని అకోలలో ఒక భాగంతో పోల్చి ఈ భాగం విలువుగా చూలడమే తన వ్యక్తిత్వంలోని ముఖ్యవిషయమని వివరించాడు. (Chap- 12 pp 97) రెండుగా చీలిన భాగాలలో ఒకటి కర్తృత్వమైనది (Active), రెండవది ధ్యానపరమైనది (contemplative). ఈ రెండూ విడిపోయిన తర్వాత ప్రతిముఖంగా పనిచేసాయని ఊహించాడు. ఈ పోలిక అతని జీవితం స్పష్టంగా నిరూపిస్తున్నట్లు సులభంగా అర్థమవుతుంది. ఈ విషయాన్ని Age Of Longing అనే పుస్తకంలో ఒక పాత్రద్వారా చెప్పాడు. "యూరోప్ కి భవిష్యత్తు లేదని నా అభిప్రాయం. ఆఖరి దశలో ఉన్న ఒక అధ్యాయం మనముంటున్నాము ఇది కను బుద్ధితో తెలుసుకున్న సత్యం. ప్రపంచాన్ని విస్మరించిన అనంతత్వంలో ఫలితాలను నన్ను విపరీతంగా బాధించవేయలేరు. కాని అపార్యంతో పోరాడటం క్రూరంగా అనవసరమని కూడా నమ్ముతున్నాను. ఈ యుద్ధంలో విజయం అసంభవమైనా (జయించామని అనిలేకపోయినా) సరే" ఈ చివరి మాటలు కామస్‌ను స్మరింపజేస్తాయి ("It is a never ending defeat" The Plague.)

యారో ఇన్ బ్లూ (Arrow In The Blue) లో మరొకచోట (Chap-26) తన జీవితంలో అవిర్భం

---

10. "The emotional commitment came first, the arguments came later." "It certainly must sound grotesque to those who take it for granted that political attitudes are primrily formed by rational consideration." "———the diagnosis of the causes of any political attitude ought to penetrate through the layers of ratio. nalisation and phraseology down to the psychological roots. (A.I.B. ch. XI pp 92.)

11. "Koestler uses words as thought saving gadgets from the ironmongery counter, and draws especially on the vocabulary of science and economics......" "Koestler has a voice, an urgent voice, vital, voluble and lively, above all never boring—a voice but an arid and mechanical style." "———this is an unkind criticism to make of a displaced writer who is not writing in his own tongue—but we suspect language is no inconvenience to him: language is a machine." (V. S. Pritchett. The art of Arthur Koestler.)

కోసం ఏకాగ్రతతో విపక్షంతల రచనకు తీరిక, ఆసక్తి లేకపోయిందని కోయిస్లర్ వ్రాసుకున్నాడు. "—the experience had been too consummated and burnt out (to be verbalised)" ఇది నిజమైతే అతను కేవలం 'జర్నలిస్ట్' గానే ఎందుకు పేరుపొందాడో తెలుసుకోవటం సులభం

ఇన్‌విజిబుల్ రైటింగ్ (Invisible Writing)లో తన ఆధ్యాత్మిక సిద్ధాంతాలను గురించి కోయిస్ట్లర్ వ్రాశాడు. ఈ పుస్తకం పేరుకూడా తనకు తెలిసిన సత్యాన్ని నిరూపించడానికి పెట్టాడు. అతని సిద్ధాంతాలు విశేషంగా వున్నట్లు అనిపించదు. మనకు సాధారణంగా ఇంద్రియాలద్వారా తెలిసే వాస్తవికత్వం (reality) కాక, ప్రత్యేకమైన వాస్తవికత్వం (Conceptional reality) కూడా వున్నదనీ ఇదిగాక అనిర్వచనీయమైన వాస్తవికత్వం వున్నదనీ అవ్యక్తస్వరూపం మహోయుక్తం. మతిపాపకులు వారెందరికీ ఈ వాస్తవికత్వం అప్పుడప్పుడు తెలుస్తుందని చెప్తాడు ఈ దర్శనమే 'అదృశ్యరచన' (Invisible Writing) అని కోయిస్లర్ అంటాడు ఇది ప్లేటో సిద్ధాంతమనిపిస్తుంది.

(Indeed in his seventh Epistle he (plato) denounces the notion that a final system can be verbally expressed—" White Head, Adventures of ideas, chap. 9, Section IV. ప్లేటో అన్నట్టి ఆ పలుకులు ఇలాంటి ఊహను ప్రతిపాదించాయి

ఆదర్శం కోల్పోయిన యూరోపియన్ ప్రజ్ఞలలో కేవలం తన సంస్కృతిలో, నాగరికతలో తిరిగి ఏర్పడిన నమ్మకం కోయిస్లర్ లో కనుపిస్తుంది. విదేశీయైన వారికంటెల్లా తన విశ్వాసాలు పన్నగిల్లి, కమ్యూనిజంపై అభిమానం కొంతకాలం ఏర్పడినా కమ్యూనిస్టు సిద్ధాంతాలు పాశ్చాత్య సంస్కృతిలో ఇమిడివున్న మానవతావాద హితప్రాధాన్యతాదాల విలువలు (humanistic values)ను నాశనం చేసాయని తెలుసుకొనగానే తిరిగి పాశ్చాత్య సంస్కృతి విలువలనే ఆశ్రయించాడు.

ప్రస్తుతం కోయిస్లర్ వ్రాస్తున్న "The Sleepwalkers—A History of Man's Changing Vision of the Universe" అనే పుస్తకంలోని భాగాలు కొన్ని వెలువడ్డాయి. శాస్త్రవేత్తల మధ్య, మతాచార్యులమధ్య ఉండే యుద్ధాన్ని (cold war - అనే పదం వాడాడు) అధ్యయనానికి, శాస్త్రీయతకూ మతానికీ మధ్యవుండే సంబంధాలను అనుశీలించడానికి ఈ పుస్తకం వ్రాస్తున్నానని చెప్తున్నాడు. కోయిస్లర్ ప్రస్తుతం కాలంలోని ధ్యానవిధి మెల్లగా నేర్చుకుంటున్నాడు. ఆధ్యాత్మికపైన సాంకేతిక మన మతినిలి బదిలీవారమే కాదమా!

---

## సవరణ

భారతి 1969 జనవరి సంచికలో ప్రకటితమైన "అమెరికాలో ఇంగ్లీషు సాహిత్యం" అనే వ్యాసంలో కొందరు రచయితల పేర్లు తప్పుగా పడ్డాయి. 79వ పుటలో అచ్చుకము అవడానికి పోయినము అని, మూడు వాక్యాల పాటు దొర్లింది. పాఠకులు సవరించుకోవాలని మనవి.

—సం. భా.]

'రామో జేతి నలో జేతి జేతి రాజా పురూరవాః,
అలర్క స్సర్వధనం ప్రాప్య నాన్యో రాజా భవిష్యతి.'

(కశేగని విధిని పొంది నాన్యను ఈ దేశం రాజవుతాడు. ఈ సంగతి రామునికి, నలునికి, పురూరవునికి తెలుసు. ఇది అంతరార్థం. కశేగని ధనం పొంది మరెవరూ రాజు కాలేరు. ఈ సంగతి రామునికి, నలునికి, పురూరవునికి తెలుసు. ఇది పైకి కనిపించే అర్థం.) అని.

అంతరార్థం గ్రహించిన నాన్యదేవుడు తర్వాత ఆ పాము కనిపించిన స్థలం తవ్వించాడు; అక్కడ అతనికి అపారమైన నిధి లభించింది. ఆ ధనంతో అతడు పెద్ద సైన్యం సిద్ధపరచుకొని 1097 లో మిథిలను ఆక్రమించుకొని రాజ్యం స్థాపించాడు. ప్రథమ రాజధానిని ఆ పాము కనిపించిన చోటే నిర్మించి, దానికి "నాన్యపురం" అని పేరు పెట్టాడు. ఆ సంవత్సరమే ఆయన "సిమరామపురం" అనే మరొక రాజధానిని కూడా నిర్మించాడు. ఇది నేడు నేపాల్ లో చేరి పోయింది; సిమ్‌రావ్ నగర్ అని మారిపోయింది. సిమ్‌రావ్‌నగర్‌లో లభించిన శాసనంలో దీని వివరాలున్నాయి.

"నందేందు బిందు విధుసమ్మిత శాకవర్షే
తచ్ఛ్రావణే సితదలే మునిసిద్ధ తిథ్యామ్,
స్వాతీ శనైశ్చరయుతే కరివైరిలగ్నే
తన్నాన్యదేవ నృపతిః వ్యదధీత వాస్తుం"

(శకవర్షాలు 1019 శ్రావణశుక్ల సప్తమి శనివారం సిద్ధియోగ స్వాతీ నక్షత్రయుక్త సింహలగ్నంలో నాన్యదేవుడు ఈ కోటను పూర్తిచేశాడు.)

కాని, బెంగాల్ బిహార్‌లను పాలించే సేన వంశ రాజులకు తమ పొరుగున ఒక స్వతంత్రరాజ్యం కలగడం కన్నెర్ర అయింది. సేనవంశ రాజయిన బల్లాలసేనుడు మిథిలపై దండెత్తి, నాన్యదేవుని ఓడించి బందీగా పట్టుకొని గంధేశ్వర్ కోటలో నిర్బంధించాడు. నాన్యదేవుని దయనీయ పరిస్థితిని ఉమాపతి అనే ఆస్థానకవి శ్రోతలకు కన్నుల నీరు కారేటట్టుగా వర్ణించాడు. ఆ కరుణగాథ చెక్కిన శిలాఫలకం నేడు కలకత్తా మ్యూజియంలో భద్రపరచబడి ఉంది. నాన్యదేవుడు నిర్బంధంలో ఎంతో కాలం ఉండలేదు. అతని కుమారుడు గంగదేవుడు పెద్ద సైన్యం కూర్చుకొని బల్లాలసేనునిపై దండెత్తాడు. ద్వాలఖ్ అనే చోట ఘోరమైన యుద్ధం జరిగింది. బల్లాలసేనుడు పూర్తిగా ఓడిపోయాడు. గంగదేవుడు తండ్రిని చెరవిడిపించి రాజధానికి పిలుచుకొని వచ్చాడు.

తండ్రి తర్వాత గంగదేవుడు 1134 లో రాజ్యానికి వచ్చి 1148 వరకు ఏలాడు. పరిపాలన సౌకర్యం కోసం అతడు తన రాజ్యాన్ని పరగణాలుగా విభజించి పరగణాకొక చౌధరీని నియమించాడు. చౌధరి అంటే దరుని భాగమైన పన్ను వసూలు చేసే అధికారి. గంగదేవుడు అంధ్రఠాఢి అనేచోట పెనుకోటను నిర్మించాడు. గంగదేవుని సోదరుడు మల్లదేవుడు కాన్యకుబ్జాధిపతి అయిన జయచంద్రుని ఆస్థానంలో మిథిల రాయబారిగాను, ప్రధానాంతరంగికుడుగాను ఉండేవాడు. ఈతడు నేపాలదేశంపై మిథిల అధికారం ప్రబలంగా ఉండేటట్టు చేశాడు.

గంగదేవుని తర్వాత నరసింహదేవుడు 1148 లో మిథిలాధిపతి అయ్యాడు; అతడు 1204 వరకు పాలించాడు. అతడు మహమ్మద్ ఘోరీ సైన్యానికి ప్రధాన సేనానాయకుడుగాను కొంతకాలం పనిచేశాడు. ఎందుకో అతనికీ నేపాలదేశాన్ని పాలించిన అతని సోదరుడు మల్లదేవునికీ వైమనస్యం ఏర్పడింది. దానితో నేపాలం మిథిలారాజ్యంనుంచి విడిపోయి స్వతంత్ర రాజ్యమైంది.

నరసింహదేవుని తర్వాత అతని కుమారుడు రామసింహదేవుడు 1204 లో రాజ్యానికి వచ్చాడు. అతడు సంస్కృతసాహిత్యాన్ని చాల అభిమానించాడు. ఆయన కాలంలోనే వేదభాష్యాలు, వ్యాఖ్యానాలు రచితమయాయి. మహామహోపాధ్యాయ శ్రీకరాచార్యులు అమరకోశానికి "వ్యాఖ్యామృతం" అనే టీకను, రత్నేశ్వర పండితుడు సరస్వతీకంఠాభరణమనే అలంకారశాస్త్రగ్రంథానికి 'రత్నదర్పణం' అనే వ్యాఖ్యను, పృథ్వీధరాచార్యుడు మృచ్ఛకటిక వ్యాఖ్యను రచించారు. అతని కాలంలోనే సుప్రసిద్ధ విద్వాంసుడు గణేశపండితుడు, భాష్యభామతీకార వాచస్పతిమిశ్రుడు ఉన్నారు. రామసింహదేవుడు 92 సంవత్సరాలు జీవించి ఢిల్లీరాజు నసీరుద్దీన్ మహమ్మద్ కాలంలో మరణించాడు.

తర్వాత రాజ్యానికి వచ్చిన శక్తిసింహదేవుడు గొప్ప విద్వాంసుడు, విద్యాపోషకుడు. అతడు విద్యావ్యాసంగంలో మునిగి తేలుతూ ఉండడంవల్ల చండేశ్వరమహాఠా అనే రాజకార్యధురంధరుడు ప్రధానిగా పరిపాలన నిర్వహణకు ఏడుగురు మంత్రులను నియమించాడు. శక్తిసింహదేవుడు "సప్తరత్నాకరః" అనే సముచ్చయ గ్రంథం రచించాడు. దీనిలో కృత్యరత్నాకరః, దానరత్నాకరః, వ్యవహారరత్నాకరః, శుద్ధిరత్నాకరః, పూజారత్నాకరః, వివాదరత్నాకరః, గృహస్థరత్నాకరః, అనే ఏడు భాగాలున్నాయి. అతడు ఐదు సంవత్సరాలు మాత్రమే రాజ్యం పాలించి కాలధర్మం చెందాడు.

శక్తిసింహదేవుని తర్వాత అతని కుమారుడు హరిసింహదేవుడు రాజ్యానికి వచ్చాడు. అతడు నేటి బిహారీలకు చిరస్మరణీయమైన పనిచేశాడు. అతడు పండిత రఘుదేవఝా అనే విద్వాంసుని సహాయంతో

# గ్రంథవిమర్శనము

## వజ్రచ్ఛేదిక

బుద్ధుడొక మహావ్యక్తి. అతని వ్యక్తిత్వం అతని జీవితకాలంలో ప్రజలను ముగ్ధులను చేయడం నిజమే. కాని, అతని నిర్యాణం అనంతరం ప్రజలకు అతనిలోనిగల అభినివేశం అంతరించసాగింది. ఉపాసకులకు బౌద్ధభిక్షువులను ఆదరించడం, రత్న త్రయాన్ని ఉచ్చరించడం, పంచశీలాలు ఆదరించడం తప్పితే-గత్యంతరం కనిపించలేదు. ప్రజాసామాన్యానికి అంతగా ఇది సంతృప్తి కలిగించలేదు. తాత్త్విక సిద్ధాంతాలో ప్రజలకు దురవగాహాలు. కనుక ప్రజలమనస్సును మార్చగొనడానికి బౌద్ధంలో సంస్కరణ అవసరమైంది. దీనికి కొందరు పూనుకున్నారు. దీనితో జాతకకథలు, అవదాన కథలు మున్నగువాటిద్వారా స్వార్థత్యాగ భూతసేవలను ప్రోత్సహించడం ప్రారంభమైంది. కాని, పూర్వాచారప్రియులు అనూచానంగా వచ్చిన నియమ నిష్ఠలను సడలింపరాదని భీష్మించుకొని, సంస్కరణ విముఖులయ్యారు. ఈ సంస్కరణవాదులనే మహాసాంఘికవాదులంటారు. ఈ మహాసాంఘికవాదమే మరికొన్ని మార్పులువచ్చి మహాయానంగా వికసించింది.

సిద్ధార్థుడుపొందిన అత్యున్నతమైన బోధిసత్త్వం పొందడానికి ఏర్పడినమార్గం కనుక మహాయానం- అని దీనిని నిర్వచించారు, మహాయానవాదులు. ఈ యానం తత్త్వదృష్టి సంగ్రహంగా ఇది: సత్యానుభూతికి రెండు ఆవరణాలున్నాయి. మొదటిది, దోషావరణం. రెండవది, జ్ఞేయావరణం. నిష్ఠవల్ల, ధ్యానంవల్ల దోషావరణం తొలగుతుంది. ఇది తొలగితే పుద్గలశూన్యత— వ్యక్తిత్వశూన్యత—మాత్రమే భాసిస్తుంది. జ్ఞేయావరణం తొలగితే పుద్గలశూన్యతతో పాటు ధర్మశూన్యత— సకలప్రాపంచికపదార్థాలమిథ్యాజ్ఞానం—భాసిస్తుంది. ఈ రెండు ఆవరణాలూ తొలగించుకొంటేనే సత్యదర్శనం. సత్యదర్శనమైతేనే బుద్ధులవుతారు. ఈ మహా లక్ష్యం కలది గనుకనే మహాయానం.

ఈ మహాయానాన్ని శూన్యవాదంతో బహుళవ్యాప్తం, తర్కబద్ధంచేసి ప్రవర్తింపజేసినవాడు నాగార్జునాచార్యుడు. ఈతడు క్రీస్తుశకం రెండవ శతాబ్దిలో వెలసి పెక్కు గ్రంథాలు రచించినవాడు. వాటిలో ఇంతవరకు 24 గ్రంథాలు మాత్రమే లభించాయి. వీటిలో ఉద్గ్రంథం ప్రజ్ఞాపారమిత. దీనికి శతసాహస్రి అన్నారు నాగార్జునాచార్యుడు. ఇది బుద్ధుడు తన ఉపదేశ సమయంలో శిష్యుల ప్రశ్నలకు చెప్పిన సమాధానాల క్రోడీకరణం కనుక ప్రశ్నోత్తర రూపంలో ఉంటుంది. ఈ ఉపదేశాల సారాంశమిది :

ప్రపంచానికి వైకల్పిక సత్తమాత్రమే ఉంది కాని పారమార్థిక సత్తకాని, పారమార్థిక అసత్తకాని లేదు. నిజానికి ఏ వస్తువుకూ స్వతస్సత్తిలేదు. కనుక ఈ విశ్వం వివిధ పరమాణు సముదాయం మాత్రమే. ఈ సంబంధం వల్లనే ప్రపంచం ఒక జలచక్రంవలె పరిభ్రమిస్తుంది ... వైకల్పికత్వం ఉన్నంతవరకు సత్యం లభించదు. సత్యత్వసాధనకు వైకల్పికత్వం తొలగాలి. అప్పుడు సత్యం శూన్యత్వం గోచరిస్తుంది. శూన్యత్వమే నిర్వాణం. అది "అస్తినాస్తి తదుభయానుభయ వినిర్ముక్తస్వరూపం".

ఈ శతసాహస్రి అయిన ప్రజ్ఞాపారమితలో భాగమే ఈ వజ్రచ్ఛేదిక. పదార్థాలలో వజ్రమెలా ఘనంగా మెరుస్తుందో ఇదికూడా తత్త్వశాస్త్రంలో తేజోవంతమై, ఆవరణాలను ఛేదించేది గనుక 'వజ్రచ్ఛేదిక' అన్న సార్థకనామం ఏర్పడిందని బౌద్ధదార్శనికులు అన్నారు. ఈ మహాయాన సంప్రదాయమే టిబెట్, చైనా, మంగోలియా, కొరియా, జపాన్ దేశాలలో వ్యాపించింది. ఈ వజ్రచ్ఛేదిక చైనా భాషలో క్రీస్తుశకం 400 లో అనూదితం కావడమే దీనివ్యాప్తికి తార్కాణం. తూర్పు తుర్కిస్థాన్‌ని కూచా అనే రాష్ట్రంలో వసించిన కుమారజీవుడనే మహాయాన బౌద్ధాచార్యుడు తన పండిన వయస్సులో చాంగ్-యాన్‌కు వెళ్ళి దీనిని చైనా భాషలో అనువదించాడు. తర్వాతనే బోధిరుచి, పరమార్థుడు, హుయాన్‌త్సాంగ్, ఇత్‌సింగ్, ధర్మగుప్తుడు మొదలయినవారు బౌద్ధదర్శన గ్రంథాలను అనువదించే సంప్రదాయం ఏర్పడింది. కుమారజీవుడు

## శ్రీ మహావిద్యాది సూత్రావళి

పురాణాలద్వారా, తర్వాత తర్వాత క్షుద్ర తంత్రాలద్వారా ఉపాసనా వైపరీత్యాలు ఉత్పన్న మయాయి. వామాచారాలు బహుళంగా వ్యాపించాయి. క్షుద్రాచారాలు, చీపురుకట్టలు, మకారపంచకం, బలిపీఠాలు, ఆడంబరాలు పెరిగిపోయి దైవచింతన ప్రాముఖ్యం వెనుకబడింది.

భారతదేశంలోని ప్రజల కందరికీ మూలపురుషులు ఋషులు కేవ లార్యులే. కోట్ల ప్రజలు మూలదీక్షా విధానం [illegible] మారుతుంది. కాని, నేడు ఆ ఋషుల నామమాత్రమైనా స్మరించటంకూడా కరువైంది. వేదాలలో ఇంద్రుని, అగ్నిని, వరుణుని, పొందుపర్చటంచేత మనకు, పరబ్రహ్మస్వరూపములుగా కన్పించిన దానికి ప్రయోగించిన 'భారా' శబ్దానికి లాలకులు ఉన్న అపారం ఏర్పడి, దానికై ఎంతో సాహిత్యం పుట్టింది. అంతేకాక పాశ్చాత్య ప్రాచీన భావితాంత్రికులు సంప్రదాయ పెంపకం లేనిది దిక్కార్య పరామర్శలు కూడా కొంత అలాటిదానికి కారణమయాయి. ఈ సంప్రదాయం పేరులోనూ కొన్ని వికృతివాలు పొడుకున్నాయి.

అలాటి అపోహలను, దురాచారాలను తొలగించి ప్రజలలో పవిత్రత భావాలు పోషిందానికి ప్రయత్నించిన పరమయోగులలో ఒక్కరు కావ్యకంఠ గణపతి మునీంద్రులు. వైదికమైన ఉపాసనలని, అదే యోగమని నిరూపించడానికి ఈ సూత్రాలు వ్రాశారు. విస్తృతంగా ఉపాసించుకోవాలో తెలిపి సాత్త్వికోపాసన, ప్రాణోపాసన నిర్వచించారు.

ఈ సూత్రావళి పుటలు: డెమ్మీ 18. ఎడమ పక్కన సూత్రాలు, కుడిపక్కన శ్రీ కుంటూరు

# మనవి మాటలు

"ఆధునిక జ్ఞానోపార్జనకు, ఉన్నత సాహిత్యాధ్యయనానికి, ప్రపంచ విజ్ఞానాలతో సహ ఇంగ్లీషు భాషా పరిచయం అవసరం. నేటి పరిస్థితులబట్టి మనకు ఇష్టమున్నా లేకపోయినా ఇంగ్లీషు నేర్వడం అత్యావశ్యకం. ఇంగ్లీషు అంతర్జాతీయ భాష" అన్నారు గాంధీజీ.

ఇవి ఇప్పటి మాటలు కావు; నాలుగు దశాబ్దాల నాటి మాటలు. 1917 అక్టోబర్ నెల 20 వ తేదీన బ్రోచ్‌లో ద్వితీయ గుజరాత్ విద్యా విషయిక మహాసభ జరిగింది. దానికి అధ్యక్షత వహించినవారు గాంధీజీ. జాతీయభాషకు లక్షణాలేమిటి?—అని ప్రశ్నించారు ఆయన. సమాధానంగా ఇలా నిర్వచించారు:—"(1) ప్రభుత్వోద్యోగులు అనాయాసంగా నేర్చుకోగలిగేటట్టు ఉండాలి (2) యావద్దేశంలోని మత రాజకీయాది వివిధ విషయాల చర్చకు ఉపయుక్తమైనది కావాలి. (3) దేశంలోని అధిక సంఖ్యాకులు భాషించేది కావాలి. (4) యావద్దేశమూ సులభంగా నేర్చుకోగలిగేది కావాలి. (5) తాత్కాలిక ప్రయోజనాల దృష్టికి వెలిగా నిర్ణయించబడినదిగా ఉండాలి. ఈ ఐదు లక్షణాలూ హిందీకి ఉన్నాయి. కనుక దానితో మరే భారతీయ భాషా పోటీచేయజాలదు... కాని ఇంగ్లీషు తప్పక నేర్వాలి......"

భాషా రాష్ట్రోద్యమం ప్రారంభంలోనే గాంధీజీ ఈవిధంగా నిర్వచించడం ఎంతో దూరదృష్టికి నిదర్శనం.

నేడు విజ్ఞానం వేయిరూపాలతో విస్తరిస్తున్నది. ఇంగ్లీషులో ఆధునిక శాస్త్రజ్ఞానం అభివృద్ధి చెందిందనేది నిర్వివాదం. మనం ప్రాచీనశాస్త్ర జ్ఞాన సంపాదనకు సంస్కృతభాష నేర్చాము. అట్లే ఆధునిక విజ్ఞానం సంతరించుకోవడానికి, ఇంగ్లీషు నేర్వడంలో అనుపపత్తి ఏమిటి? నేడు రాజకీయ జాతీయతత్వం, జాతివాదం పెరుగుతున్నాయి. వాటిని మూలభాషలో చదవడం జ్ఞానదాయకం. రాజాజీ అన్నట్టు అనువాదాలలో కాలహరణం చేయలేము. 'సెకండ్ హాండ్' జ్ఞానం అఖండ జ్ఞానం కాదు. అనువాదాలవల్ల సంపాదించుకొనే జ్ఞానం 'స్వప్నలబ్ధ భక్షణం' వంటిది.

ఇంగ్లీషు నేర్వడమే తప్పంటున్న 'జాతి ద్రోహులు' అది అధికారభాషగా కూడా ఉండవలసిందంటే అబ్బురపడుతారేమో! అది విదేశీయం అన్నది వారి వాదసరణి. రాజాజీ అన్నట్టు మనం ఏవి విదేశీయమని మానుకున్నాము? విదేశీయుల ఆర్థిక సహాయం వలదన్నామా? కామన్‌వెల్తునుంచి వదలి వచ్చామా? వారి పరిపాలన పద్ధతులను ప్రోత్సహించడం మానుకున్నామా? గ్రహాంతర ప్రయాణమే గ్రామాంతర గమనమైన నేడు 'విదేశీయ' మనే మాటలు వింత కాదూ? కనుక ఉన్నతస్థాయిని అధికారభాషగా ఇంగ్లీషు కొనసాగడం ఎంతమాత్రమూ అపాయకరమూ, ప్రజాస్వామ్య ప్రతికూలమూ కాదు.

ఒక్క 'విదేశీ' భాషకే అంత పెద్ద పీట వేయడం కొందరికి కంటగింపు కావచ్చు. అప్పుడు మరికొన్ని దేశీభాషలకూ అధికారభాషాస్థాయి కలిగించడానికి ఆక్షేపణ ఎందుకు? హిందీ; ఒకప్పుడు రాజభాషగా రాజిల్లిన మరాఠీ; దక్షిణాపథాన్నంతా దీధితులతో నింపిన తెలుగు; ఇటీవల భారతజాతికి గౌరవం తెచ్చిన బెంగాలీ—అధికారభాషలు కానివ్వండి. సోవియట్ రష్యాలో ఎన్నో అధికారభాషలు; కెనడాలో ఒక్కటికి మించిన అధికారభాషలు; స్విట్జర్లాండ్‌లో నాలుగు అధికారభాషలు—జనసంఖ్యలో నూటికి ఒక్క శాతం వున్న రోమానిష్ (Romansch) కు కూడా జాతీయ భాషాగౌరవమిచ్చిన ఔదార్యం దానిది.

మనసులు కలవాలిగాని, మాటను మన్నించడం ఎంతలో మాట! జాతిమత కుట్లు కనిపించే అతుకుల బొంత కారాదు; కన్నులకు విందుచేసే ఇంద్రధనుస్సులా ఉండాలి. దానికి పరమసాధనాలు సహనం, సామరస్యమూను.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad